Regtd. No. M 990 15th AUGUST 1912. Vol. I. VII.

ఓమ్

# జ్యౌతిషప్రకాశిక.

# JYAUTISHAPRAKASIKA.

**A Telugu Monthly Astrological Magazine.**

EDITED BY

IVATURY AYYANNA, *Pleader*. | I. MURTIRAJA SARMA. *Astrologer*.
SIDDHANTI. KOMPELLA SUBBARAYA SASTRY. | DANDIBHATTA RAMAMURTI SASTRY, *Astrologer*.

AND

PUBLISHED BY IVATURY MURTIRAJA SARMA,
MANAGING PROPRIETOR,
AMALAPURAM.
*Godavari District.*

*AMALAPUR*:
PRINTED BY PERI VENKATESWARA SARMA,
AT THE SARVANI PRESS.

1912

**CONTENTS.**





*Annual Subscription Rs. 3—4—0.*

ఓమ్

# జ్యోతిషప్రకాశిక.

జ్యోతిష విషయములను దెలుగున దెలుపు నొక

మాసపత్రిక.

పత్రికాధిపతులు.

1 ఇవటూరి అయ్యన్న ప్లీడరు. || 3 ఇవటూరి మూర్తిరాజశర్మ.
2 సిద్ధాంతి కొంపెల్ల సుబ్బారాయ శాస్త్రి || 4 దండిభట్ల రామమూర్తి శాస్త్రి.

నిర్వాహక పత్రికాధిపతి

ఇవటూరి మూర్తిరాజశర్మచే ప్రకటింపబడినది

అమలాపురము,

గోదావరిజిల్లా

అమలాపురము

వేరి వేంకటేశ్వరశర్మగారి స్వకీయ శ్రీశర్వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1912

## విషయసూచిక

—::0::—

రాజపోషకులు

---

మహారాజ రాజ శ్రీ

శ్రీ శ్రీ రాజా శ్రీవత్సవాయ

సుభద్రయ్యమ్మ జగపతి బహదూర్

జమీందారిణివారు

తుని.

రాజపోషకులు

---

మహారాజశ్రీ

శ్రీయుత

శ్రీకొవ్వూరి చంద్రారెడ్డి గారు

జమీన్‌దారువారు

నిడదవోలు.

ప్రధానపోషకులు

---

మహారాజ రాజశ్రీ

శ్రీవత్సవాయ గోపాలరాజుగారు

మోడేకుఱ్ఱు.

---

ప్రధానపోషకులు

---

శ్రీమంతు శ్రీరంగదేవరాయులవారు

నరపతిసంస్థానము

ఆనగొంది

విద్యానగరము.

పోషకులు

---

మహారాజ రాజశ్రీ శ్రీరాజా

తడకమళ్ల సీతారామచంద్రరావు బహదరు

జమీందారు గారు

చేతవోలు.

——:0:——

మహారాజరాజశ్రీ

అయ్యగారి నారాయణమూర్తిగారు B. A., B. L.,

ఫస్టుగ్రేడు ప్లీడరు,

తణుకు.



# జ్యోతిషప్రకాశిక.

ప్రత్యాంగ్లేయ మాసముయొక్క పదియైదవ
దినమున ప్రకటింపబడును.

శ్రీమదఖిలజగద్భవస్థితిగతులను । భూఖగోళప్రవృత్తులభూతభావి ।
వర్తమానార్థములలోకవర్తనముల । జ్యోతిషప్రకాశిక తెల్పిజయముగనుత॥

సంపుటము. ౧. { అమలాపురము. పరీధావినామ సంవత్సర శ్రావణ మాసము. } సంచిక ౭

## మనవి గైకొనుఁడు.

మేమిదివఱకు మాచందాదారులకు 6 పత్రికలనందఁజేసి యున్నారము. ఇయ్యది యేడవ పత్రిక. ఇప్పటివఱకు మాపత్రికకు 360 మున్నూట యఱువది మంది చందాదారులు చేరియుండిరి; కొందఱు చందాదారులు మాత్రమే చందా ధనము నిచ్చియుండిరి. బాకీయున్న చందాదారుల సంఖ్యయే హెచ్చుగానుండిన యది; కాబట్టి బాకీయున్న చందాదారులు దయచేసి సంవత్సరపుచందా పైకమును శీఘ్రముగా మాకందఁజేసి జ్యోతిశ్శాస్త్రమునకు ప్రోత్సాహము గలుగఁజేసి మాయుత్సాహమును వృద్ధిఁజేయ మాచందాదారులను గొనియాడుచు మిక్కిలిమక్కువతో నెక్కువగఁ బ్రార్థింపుచున్నారము.

## భృగుసంహిత

ప్రతివారును తమతమజాతకములలోని లగ్నచంద్రులను నీపత్రికయందు వచ్చు చక్రములలో నేచక్రమందు వేసికొనిన తమజాతకమునకు సరియగునో యట్టిజాతకచక్రమునకు వ్రాసినఫలములే తమజాతకఫలములని గ్రహించి కొనవలయును.

మాపత్రికకుఁ జందాదారులుగ నుండువారు వారియొక్క జాతకములను బంపినయెడల నట్టిజాతకములకు భృగుసంహితనుబట్టి శుభాశుభఫలములను వ్రాసి మాపత్రికయందుఁబ్రకటించెదము. అందువలన జాతకుని యొక్క సామదాయక (General) ఫలములు తెలియఁబడఁగలవు. అట్లుప్రకటించుటవలనఁదమ జాతక ఫలములితరులకెందుకుఁదెలియవలెనను సందేహము కొందఱకుఁగలిగినఁ గలుగవచ్చును. అట్టిప్రకటనవలన నొకరిజాతకముయొక్క ఫలములు మఱియొకరికిఁదెలియవీలులేదు. ఇతరులు గ్రహింపసాధ్యముకాదు. ఏజాతకునియొక్క జాతకఫలములు వ్రాసిప్రకటింతుమో యట్టివారికిఁదెలియునటుల వారికిఁబంపించుఁ బత్రికలో మాత్రమొక గుఱుతు వేయుదుము. తక్కిన చందాదారులకుఁబంపుఁ బత్రికలలో నట్టిగుర్తులుండవు గనుక తెలియుట కష్టసాధ్యము. కావునఁదమకిష్ట మున్నవారు వారుపుట్టిన సంవత్సరమును, మాసమును, తిథియును, వారమును వేసి వ్రాసిన జాతకమునుఁబంపించినయెడల భృగుసంహితనుఁబట్టి శుభాశుభఫలములు వ్రాసి పత్రికయందు ప్రకటించెదము. ఇందుకు వేతే సొమ్మీయనక్కరలేదు. ఇట్లుప్రకటించుటవలన సర్వజనసామాన్యమునకు వెల్లడియగు నన్నసందేహమున్నచో భృగుసంహితనుబట్టి ఫలములనుఁదెలిసికొన నిచ్ఛగలవారు పోస్టేజీ వగయిరా ఖర్చులకుఁగాను వకరూపాయి పంపించినయెడల వేరుకాకితముమీఁద వ్రాసి టపాద్వారా పంపించెదము.

ఇట్లొక్కొక్క చందాదారున కొక్కొక్క జాతకమునకు మాత్రమే ఫలములువ్రాయబడును,

---

చందాదారులు కానివారు తమజాతకఫలములను భృగుసంహితనుబట్టి తెలిసికొన నిచ్ఛయుండినచో జాతకమొకటికి రు 3-0-0 లు చొప్పున ముందుగాబంపినయెడలవారు పంపిన జాతకములకు తెలుగున ఫలములువ్రాసి పంపబడును.

భృగుసంహితనుబట్టి ఫలములువ్రాసి పత్రికలో బ్రకటించుటకు మాచందాదారులు పంపించిన జాతకములు మాకందినవికాని విస్తారముగానుండుటచే మాకు చేరినవానిని వరుసను క్రమక్రమముగా బ్రకటించుచున్నారము కావున చందాదారులు తొందరపడవలదు.

# కృతి విమర్శము

—:0:—

హిందూజన సంస్కారిణి :—ఇది మద్రాసునందు ప్రకటింపఁబడు మాస పత్రిక. ఇయ్యది మున్ను సుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ మన్నవ బుచ్చయ్యపంతులు గారిచేఁ బ్రకటింపఁబడుచు శ్రుతి స్మృత్యాది దుర్విజ్ఞేయార్థ బహుగ్రంథముల నాంధ్రలోకమునకు వెల్లడిఁజేయుచు వారుస్వర్గవాసులైన పిమ్మటఁ దలఁజూపక మానము వహించి యుంటలోకవిదితమే కదా ? ఇప్పుడా బుచ్చయ్యపంతులుగారి పుత్రులగు శ్రీ సింహాచలము పంతులుగారు దానినుద్ధరించి మరలఁ బ్రకటింప నారంభించుట కాంధ్రలోక మెంతయు సంతసింపఁదగియున్నది. వీరు తతోధికము గా లోకరంజన మొనరింపనర్హులు. దీనికి సంవత్సరమునకు చందా రు ౹ 0- 0.

క్రిందటి పత్రికలోని యనుభూతజాతకతరంగిణిలో శ్రీమదప్పయ్య దీక్షితుల వారిజాతకములో లేఖకప్రమాద వశమునఁబడిన పొరబాటుల విమర్శముగా ముద్రింపఁబడినవి. వానిని ముందు సంస్కరించి ప్రకటించుచున్నాగము.

—:0:—

# విజ్ఞాపనము.

ఆర్యులారా!

మేమీజ్యోతిషప్రకాశికయను మాసపత్రిక నీసంవత్సరమున ఫిబ్రవరి నెలలో బ్రకటింపనారంభించినారము.

వేదాంగమగు నీజ్యోతిశ్శాస్త్రము మనదేశమునందతిచిరకాలమునుండియు, నసాధారణగౌరవభాజనమై పరావర స్వపర జాతిమతాది భేదభావంబులకెడమీయక సర్వజనసేవ్యమై యెల్లయుందన యాజ్ఞందలఁదాల్పు శాసనబద్ధపరిపాలనంబు గావించుచు సుమనోరథాధిగామియై ప్రత్యంతదేశముల నాక్రమించి యతిలోక మహత్వంబున సర్వాతిశాయిప్రాభవముఁగాంచి వెలుఁగొందుచుండియు నిప్పుడు కాలవశంబున దుస్సహతమఃప్రచురదోషాభిభూతమై తొంటియుత్సాహంబుడిగి నిమగ్నమై విశ్రాంతినొందియుండుట మీరెల్లరు నెఱుఁగుదురు. ఎడనెడఁబలవరిం చుచుఁ గలవరింతలుగూడ సత్యంబునకనతిదూరంబులగుటంజూడఁ బ్రబోధసమ యంబునఁ దత్ప్రతిభావిశేషంబెట్లుండునదియు నూహింపవచ్చును. ఇప్పుడు మన దేశంబున జ్ఞానసూర్యోదయంబాసన్నంబగుటచే నెల్లరు మేల్కొనుచుండిరికదా?

మనము తక్కినశాస్త్రంబులనెల్ల మేల్కొలుపయత్నింపుచు నీశాస్త్రము నేలజో
కొట్టవలయును? మనము మేల్కొలుపకున్నను నీశాస్త్రము నిదురించునదికాదు.
ప్రబోధసమయంబున నదియే మేల్కొనును. అప్పటికి మనమెదుటనుండి మేల్కొ-
లుపుచుండినచో మనవిధికృత్యమును నెరవేర్చినవారమగుటచే మనల నాత్మీయ
బుద్ధితోఁజూచుచుండును. అట్లయిన ప్రథమప్రబోధదర్శనలాభము మనదియగును.
మనమిట్లుండ నీశాస్త్రప్రబోధార్థమై యమెరికా జర్మనీప్రముఖ ఖండాంతరవా
సులచ్చటనుండిచేయు కోలాహలమంగళధ్వనులు భూనభోంతరమునిండ దిక్కులు
పిక్కటిల్లుచున్నయవి. ఆసన్నులమగు మనమంతయాడంబరముఁ జేయనవసరము
లేదు. యథాశక్తి మనవిధికృత్యముల మనము నిర్వహించుచుండినచో మనయ
విచ్ఛిన్నానుభవమితరులపాలుకానేరదు. మనమిట్లూరకుండిన మనయర్థస్థానము
లనన్యులాక్రమింపకుండుదురా? పిమ్మట కాలదోషంబునకు వగచుటకంటె మన
యర్థస్థానంబుల మనమప్రమత్తులమై కృతకృత్యులమగుట శ్రేయస్కరము. ఇది
యేవిధముచేతను నొకనికిసాధ్యముకాదు. మహాజనసహాయమునఁగాని యిది
నెరవేరునదికాదు. మేమీశాస్త్రవిషయంబులం గించిత్పరిశ్రమఁజేసినవారముకాని
సర్వజ్ఞులముకాము. మాయొద్దఁగొన్ని ప్రాచీనగ్రంథంబులును వ్యాఖ్యానంబులును
న్నయవి, సందర్భానుసారముగా నింకను సంపాదించుచున్నారము. మాకుఁదెలి
యనిసంగతులఁ బెద్దలవలనఁ దెలిసికొనుటకును మాకుఁదెలిసినసంగతులు లోక
మునకు వెల్లడించుటకును మేము నిశ్చయించుకొనినారము. మేమువృథాగ్రహిం
చుటచేఁగాని మాకుఁదెలిసియుఁ బ్రమాదముచేఁగాని మేముప్రాయుదానియం
దెందైనఁ దప్పులున్నయెడల నభిజ్ఞులుమాకుఁదెలియఁజేసినచోఁ బునర్ముద్రణమునఁ
జక్కఁజేసికొనఁగలము.

---

మేమీపత్రికావ్యాజమున ధనసంపాదన మొనరింపనెంచినవారము కాము.
మాకీపత్రికానిర్వహణమభ్యాసములేనిక్రొత్తపనియగుటవలనను గొన్నియనాంత
రపుఁజిక్కులవలనను బత్రికాప్రకటనము కొంచెమాలస్యమగుచువచ్చినది. కాని
సాధ్యమయినంతవఱకింక నాలస్యముకాదు. ఎట్లయినఁ జందాదారులకుఁ బత్రికల
న్నియు నందజేయగలము. ఇది శాస్త్రీయపత్రికగాని సకాలములోనే తెలియఁదగిన
వార్తాపత్రిక కాదు. కావున మాయాలస్యమును క్షమింపగలరని నమ్ముచున్నారము.

---

రష్యా చక్రవర్తిగారియొక్కయు, స్పెయిను దేశపు రాజుగారియొక్కయు; స్పెయిను దేశపు రాణీగారియొక్కయు, పోర్చుగలు దేశపు రాజు గారియొక్కయు; హాలండు దేశపు రాణీగారియొక్కయు; డెన్మార్కు రాజుగారియొక్కయు; ఇటలీ దేశపు రాజు గారియొక్కయు; జపాను దేశపు చక్రవర్తిగారియొక్కయు; గ్రీసు దేశపు రాజు గారియొక్కయు; నార్వే దేశపు రాజుగారియొక్కయు స్వీడను దేశపు రాజుగారియొక్కయు; రుమేనియా రాణీ గారియొక్కయు, జాతకములిందు బొందుపఱచి నారము. క్రమక్రమముగా వీనినిగురించి చర్చించి 'అనుభూతజాతకతరంగిణి' లో ప్రకటించెదము. జ్యోతిషము చదివిన బాలురకు అనుభవ జ్ఞానము (Practical knowledge) చక్కగకుదిరి జాతకములు జూచి శుభాశుభ ఫలములను చెప్పగల సమర్థులగుదురు.

## రెండవ నికోలాస్ (Nicholas II).

| | | |
|---|---|---|
| రకే / బు | కు | చగు |
| శు | | |
| ల | | శరా |

వీరు రష్యాచక్రవర్తిగారు (C. Zar of Russia) వీరు 1868 వ సంవత్సరము 18 వ మేయి తేదిని 12 గంట 2 నిమిషములకు సెంటుపీటర్సుబర్గు (St. Petursburg) పట్టణమందు జనన మొందిరి. ఉత్తరాభాద్రానక్షత్ర తృతీయచరణము. జననకాల శనిమహాదశా శేషము సుమారు 6 సంవత్సరములు.

## పదమూడవ అల్ఫోంజో (King Alfonso XIII).

| | | |
|---|---|---|
| రశు | బు | కే |
| శ | | |
| రా / లశుగు | | చ |

వీరు స్పైన్ (Spain) దేశపు రాజుగారు. వీరు 1886 వ సంవత్సరము 17 వ మేయి తేదిని పగలు 12 గంటల 30 నిమిషములకు మాడ్రిడ్ (Madrid) పట్టణమందు జననమొందిరి. జ్యేష్ఠానక్షత్ర ప్రథమచరణము. జననకాల బుధమహాదశా శేషముసుమారు 13 సంవత్సరములు.

## విక్టోరియా యీనా రాణీ (Queen Victoria Ena).

| | | ల చ |
|---|---|---|
| రా | | కే |
| కుశ శు | రగు | బు |

ఈమె స్పెయిను దేశపు రాణి. ఈమె 1887వ సంవత్సరము అక్టోబరు 24 వ తేదీ సాయింత్రము గ. 3 4.ని. లకు స్కాట్లండు నందుండు బాల్మోరల్ నందు (Balmoral) జననమొందిరి. శతభిషానక్షత్ర ద్వితీయచరణము. జననకాల రాహు దశాశేషము సుమారు 12 సంవత్సరములు.

## మ్యాన్యుయల్ రాజు (King Meanuel).

| రా | | |
|---|---|---|
| | | గు |
| చ శ | కు | కే లరబుశు |

వీరు పోర్చుగల్ దేశపు రాజు గారు. వీరు 1889 వ సంవత్సరము 15 వ నవంబరు ఉదయము లిస్బను (Lisbon) పట్టణమందు జననమొందిరి. పూర్వఫల్గునీ నక్షత్ర ద్వితీయచరణము. జనన కాలమునకు శుక్రమహాదశా శేషము సుమారు 14 సంవత్సరముల 6 మాసములు.

## విల్ హెల్మినా రాణీ (Queen Wilhelmina)

| కే | గుశ | ల |
|---|---|---|
| చ | | |
| బు ర | కుశు | రా |

ఈమె హాలండు (Holland) దేశపు రాణిగారు. ఈమె హాలండునందుండు గ్రావెన్ హేజి (Gravenhage) నందు 1880 వ సంవత్సరము ఆగష్టు 31 వ తేదీసాయింత్రము 6 గంటల 30 నిమిషములకు జనన మొందిరి. ఆశ్లేషానక్షత్ర ద్వితీయచరణమందు జననము. జననకాల బుధమహాదశా శేషము సుమారు సం. 8 మా. 9

## డెన్మార్కు రాజు గారు (The King of Denmark).

| శు రకే | | గు |
|---|---|---|
| బు | | లశ |
| చ | | కు రా |

వీరు కోపెన్ హేగను (Copenhagen) పట్టణమందు 1843 వ సంవత్సరము జూన్ 3 వ తేదీరాత్రి 10 గంటల 15 నిమిషములకు జననమొందిరి. పూర్వఫల్గునీ నక్షత్ర తృతీయచరణము. జననకాల శుక్ర మహాదశా శేషము సుమారు 10 సంవత్సరములు.

## విక్టరు ఇమాన్యుయల్ రాజు (King Victor Emanuel)

| గు రా | | చ |
|---|---|---|
| | | శు |
| ల | | శకుకే రబు |

వీరు ఇటలీ (Italy) దేశపురాజుగారు. వీరు 1869 వ సంవత్సరము 11 నవంబరు తేదీ రాత్రి గం 10--15 ని లకు నేపీల్సు (Naples) పట్టణమందు జననమొందిరి. పూర్వాషాఢానక్షత్ర 3 చరణము. జననకాల గురుమహాదశా శేషము సుమారు సం 6. మా 8.

## ముట్సు హిటో, మికేడో (Mutsu Hito Mikado).

| శ రా | | |
|---|---|---|
| చ | | |
| శు | | కుకే లరబుగు |

వీరు జపాను (Japan) దేశపు చక్రవర్తులు. వీరు 1882 వ సంవత్సరము నవంబరు 3 వ తారీఖున ఉదయము గం 5--46 ని లకు జననమొందిరి. పుష్యమీనక్షత్ర చతుర్థచరణము. జననకాల శనిమహాదశా శేషము సుమారు సం 2. మా 8.

### గ్రీసు దేశపు (Greec) రాజయిన జార్జి (George) గారు (King George of Greeo).

వీరు కోపెన్ హేగను (Cophenhagen) పట్టణమందు 1845 సంవత్సరము 24 వ డిశంబరు తేదీ రాత్రి గం 7-30 ని లకు జననమొందిరి. అనూరాధానక్షత్ర ద్వితీయచరణము. జననకాలశనిమహాదశా శేషము సుమారు 14 సంవత్సరములు.

### హాకాను రాజుగారు (King Hakon).

వీరు నార్వే (Norway) దేశపు రాజుగారు. వీరు 1872 వ సంవత్సరము ఆగష్టు 3 వ తేదీని కోపెన్ హేగను (Copenhagen) పట్టణమందు సాయంత్రము 4 టంటలకు జననమొందిరి. మఖానక్షత్ర ప్రథమచరణము. జననకాల కేతుమహాదశా శేషము సుమారు 5 సంవత్సరములు.

### స్వీడను దేశపు రాజుగారు (The King of Sweeden).

వీరు 1858 వ సంత్సరము 16 వజూను తేదీని స్టాక్ హోలము (Stockholm) పట్టణమందు ఉదయము 10 గంటలకు జననము. ఉత్తరానక్షత్ర ద్వితీయచరణము. జననకాలరవిదశా శేషము సుమారు 4 సంవత్సరములు.

యోగప్రాబల్యంబును, కళత్రసుఖంబును, అల్పధనలాభంబును గలుగును. 28 మొదలు 35 వఱకు స్వార్జితవిత్తలాభంబును, గృహలాభంబును, శత్రువృద్ధియును, సంతానవృద్ధియును, మిత్రసుఖంబును గలుగును. 35 మొదలు 40 వఱకును బహుధనలాభంబును, సంతానవృద్ధియును, మాతృపీడయును, శత్రువృద్ధియును, ధనవ్యయంబును గలుగును. 40 మొదలు 45 వఱకును శ్లేష్మబాధయు, కళత్రశరీరపీడయును, తచ్ఛాంతియును, గృహకళ్యాణలాభంబును గలుగును. 45 మొదలు 55 వఱకు స్త్రీసంతానలాభంబును, మానసోత్సాహంబును, భూలాభంబును, శ్లేష్మబాధయును, కళత్రపీడయును, మనోవిచారంబును గలుగును. 55 మొదలు 58 వఱకు దైవభక్తియు, గంగాస్నానాదిపుణ్యఫలప్రాప్తియును గలుగును. పిమ్మట ఆయుర్నివారణియును.




34 ఈజీవుడు పూర్వజన్మంబున నక్షదాతీరంబున విప్రకులంబున జన్మించి యొకవిప్రుని ద్రోహముచేయుటచే నీజన్మంబున బాల్యమందు క్లేశము నొందును.

ఈగ్రహమండలంబునకు ఫలము మంచిమనస్సును, అజన్మభాగ్యమును, స్వార్జితభాగ్యమును, రాజద్వారమందు ప్రతిష్ఠయును, సత్యాసత్యపరిశీలనమును, కార్యములయందు నిపుణత్వమును, సుందరముఖంబును, శీఘ్రకోపంబును, నిర్మలాంతఃకరణంబును, సత్కళత్రంబును, బహుమిత్రవృద్ధియును, స్త్రీసంతానవృద్ధియును, అల్పసంతాననష్టమును, బహుకీర్తియును, సోదరసోదరీవృద్ధియును, యును, స్వల్పసోదరనష్టమును, సాహసమును, దైవభక్తియును, దాతృత్వంబును, మంచివాక్కులును, అల్పవిద్యావిఘ్నంబును, బాల్యమందు పితృచింతాక్లేశభయంబును,

వాహనాదిసుఖంబును, జలభయమును, స్వల్పఅంశవ్యాధియును, తద్వ్యాధియు
ను, సత్కర్మలయందాసక్తియును, అధిక రాజయోగంబును, ధనవ్యయంబును,
పుణ్యతీర్థయాత్రాలాభంబును, సుబుద్ధియును, గానప్రియత్వంబును, కామంబు
ను, శత్రువృద్ధియు, తన్నాశంబును గలుగును.

1 మొదలు 3 సంవత్సరముల వఱకు శరీరపీడయు, వహ్నిశస్త్రాదిపీడయు,
అల్పమాతృపీడయును జేయును. 4 మొదలు 9 వఱకును విద్యారంభమును, అప్పు
డప్పుడు జ్వరపీడయును, సోదరవృద్ధియును, అల్పనష్టమును, అన్యస్త్రీస్థితియును గ
లుగును. 9 మొదలు 15 వఱకును పితృపీడయును, విద్యావృద్ధియును, మనోవిచా
రంబును, శరీరపీడయును, శాంతియును గలుగును. 15 మొదలు 20 వఱకును గృ
హకళ్యాణలాభంబును, సత్కళత్రసిద్ధియును, జలగండభయంబును, దైవకృపచే
శాంతియును గలుగును. 20 మొదలు 26 వఱకును విద్యయందల్పవిఘ్నంబును,
సంతానలాభంబును, విద్యావృద్ధియును, యోగారంభమును, మానసోత్సాహం
బును గలుగును. 26 మొదలు 30 వఱకును క్రమంబుగ యోగవృద్ధియును, సం
తానవృద్ధియును, కళత్రమునకల్పపీడయును, స్వశరీరపీడయును జేయును. 30 మొ
దలు 35 వఱకు రాజద్వారమందధిక యోగంబును, విశేషమిత్రవృద్ధియును, మా
నసోత్సాహంబును, అల్పసంతాననష్టంబును, స్వల్పశత్రువృద్ధియును గలుగును.
35 మొదలు 40 వఱకును పుత్రీపుత్రసంతోషంబును, అన్యదేశమందధిక యోగం
బును, మానసోత్సాహంబును, క్షేత్రచింతయును, భూలాభంబును, గృహకళ్యా
ణంబును, ధనవ్యయంబును, పుత్రోదయంబును, అధికసంతోషంబును గలుగును
40 మొదలు 45 వఱకును మాతృశరీరపీడయును, మనోవిచారంబును, రాజద్వా
రమందతిప్రతిష్ఠయును, మానసోత్సాహంబును, అధికధనలాభంబును, పుణ్యతీర్థ
యాత్రాలాభంబును గలుగును. 45 మొదలు 50 వఱకును దైవభక్తియును, భ
గవద్గోష్ఠియును, రాజద్వారమందధిక యోగంబును గృహలాభంబును, భూలా
భంబును గలుగును. 50 మొదలు 60 వఱకును ఉద్యోగవృద్ధియును, యాత్రా
లాభంబును, మానసోత్సాహంబును, యోగవిరామంబును గలుగును. 60 మొ
దలు 66 వఱకును క్రమంబుగ భాగ్యప్రాప్తియును, విశేషభూలాభంబును, స్వా

ధికపుత్రరాజయోగంబును, చిత్తోత్సాహంబును గలుగును. పిమ్మట ఆయుర్విష యము విచారణీయము.

| శ | | కే |
|---|---|---|
| కు | రాశి | |
| గు రా | రబు | శు |

35 ఈజీవుడు పూర్వజన్మంబున తుంగభద్రానదీతీరంబున క్షత్రియకులంబున జన్మించి విశేషమృగవ్యధచేయుటచే నీజన్మంబున గృహంబున బహుజీవనాశంబును, సంతాననష్టంబును నుండును.

ఈగ్రహమండలమునకు ఫలము విద్యాధికంబును, ధనవ్యయాధికంబును, వేదాంతవిద్యానుభవంబును, సదంతఃకరణమును, సోదరసోదరీవృద్ధియును, స్వల్ప సోదరనష్టంబును, సుకళత్రంబును, కళత్రశరీరమందుష్ణాధికమును, సంతానగర్భస్రావాది దోషబాహుళ్యంబును, సుబుద్ధియును, దైవభక్తియును, యోగారంభమును, పితృచింతయును, సువాక్కులును, మనశ్చాంచల్యమును గలుగును.

1 మొదలు 6 సంవత్సరములవఱకును శరీరపీడయును, పితృయోగవృద్ధియును, సోదరీవృద్ధియును, స్వల్పనష్టంబును గలుగును. 6 మొదలు 10 వఱకును విద్యావృద్ధియును, అల్పభూలాభంబును, అల్పమాతృశరీరపీడయును, తచ్ఛాంతియును జేయును. 10 మొదలు 20 వఱకును కళ్యాణప్రాప్తియును, విద్యావృద్ధియును, హృదయోత్సాహంబును, ధనవ్యయంబును, సోదరవృద్ధియును గలుగును 20 మొదలు 30 వఱకును రాజద్వారమందధికయోగంబును, సత్యాసత్యపరిశీలనంబును, సంతానవృద్ధియును గలుగును. 30 మొదలు 40 వఱకును నధికయోగంబును, మాతృవియోగంబును, మనఃక్లేశంబును గలుగును. 40 మొదలు 50 వఱకును విశేషయోగంబును, భూలాభంబును, గృహలాభంబును గలును. 50 మొదలు 58 వఱకును అధికయోగంబును, పుణ్యనదీస్నానంబును గలుగును. పిమ్మట ఆయుర్విషయము విచారణీయము.

36 ఈజీవుడు పూర్వజన్మంబున సింధుదేశంబున జన్మించి రాజాధిరాజయి సర్వదేశంబులను సుఖంబుగను, ధర్మమార్గంబుగను పరిపాలించి భార్యాసమేతుడై ప్రయాగనగరంబునకేతెంచి విశేషధనంబు ధర్మంబుజేసి స్వస్థానము ప్రవేశించి స్వకళత్రమును పిడిచి యన్యనారీసమేతుడై బహుకామకుడైయుండు సమయంబున నొకసాధువేతెంచిన నాతని బహుదూషణంబు చేయుటచేతను, కళత్రపరిత్యాగంబు చేయుటచేతను నీజన్మంబున బాల్యమందతికష్టంబును, పిమ్మట సత్కళత్రసిద్ధియును, కళత్రమూల మహాభాగ్యప్రాప్తియును, కళత్రసౌఖ్యహీనతయును, సాధుశాపవశంబున గర్భస్రావాది దోషంబులును కలిగి సంతానములేక దత్తస్వీకారము కలుగును.

ఈగ్రహమండలమునకు ఫలము, గానప్రియత్వంబును, సుహృదయంబును, శీఘ్రకోపంబును, విశేషాత్మగౌరవంబును, యౌవనంబున నధికభాగ్యారంభమును, లోభమును, విశేషదైవభక్తియును, ఒకానొకసమయంబున ధనవ్యయాధిక్యంబును, అల్పసోదరనష్టమును, స్వకుటుంబమును విడిచి యన్యకుటుంబస్థితియును, సత్కళత్రసిద్ధియును, మానసోత్సాహంబును, స్వకులదీపకత్వంబును, కళత్రమందనురాగంబును, శరీరమందు శ్లేష్మమును ఉష్ణమును, ఉష్ణపీడితకళత్రమును, అల్పకళత్రసుఖంబును, సంతానదోషబాహుళ్యంబును, దత్తసంతానలాభంబును, కళత్రమూలబహుధనరాజ్యలాభంబును, దేశసంచారంబును, పుణ్యనదీస్నానంబును, జ్ఞాతికలహంబును, శత్రుజయంబును మాతృసమానరూపంబును, సుభాషణంబును, సుస్వభావంబును, నిత్యానందంబును, మిత్రపరివేషణంబును, ఉత్తరాయుష్యమందు నిర్ధారయోగంబును, అతియోగవృద్ధియును, జ్ఞానంబును, తపోనియమంబును, మధ్యమసోదరవృద్ధియును, సామాన్యసోదరప్రీతియును, మోక్షాభిలాషయును, సాధుసన్యాసుల యందిష్టంబును గలుగును.

1 మొదలు 4 సంవత్సరములవఱకును నల్పశరీరపీడయును, మాతృశరీరపీడయును, తచ్ఛాంతియును, దంతపీడయును, జ్వరపీడయును, తచ్ఛాంతియును

గలుగును 4 మొదలు 8 వఱకును, విద్యారంభమును, సోదరశరీరపీడయును, శాంతియును గలుగును. 8 మొదలు 16 వఱకును నల్పవిద్యాలాభమును, దైవభక్తియును, అన్యకుటుంబ ప్రవేశమును, హృదయోత్సాహంబును, సోదరభంగము లేక జ్ఞాతివిరోధంబునుగలుగును 16 మొదలు 22 వఱకును కళ్యాణప్రాప్తియును, ఉత్తమకులజకన్యాలాభంబును, హేమమణిమాల్యాంబర లాభంబును, చిత్తోత్సాహంబును, సత్పుత్ర ధన భూలాభంబునుగలుగును. 22 మొదలు 30 వఱకును శత్రువృద్ధియును, ధనవ్యయాధిక్యంబును, కళత్రసుఖంబును, ఋణబాధయును గలుగును. 30 మొదలు 35 వఱకును కళత్రశరీరమందధికపీడయును, తచ్ఛాంతియు, బహువిరోధము, శత్రుజయము, విశేషయోగము, అన్యత్రస్థితియు, దైవభక్తియు, కామినీప్రియత్వంబును, అఖండయోగ ప్రాప్తియును గలుగును. 35 మొదలు 40 వఱకును క్రమంబుగ నతియోగవృద్ధియును, శత్రుజయంబును, కళత్రమునకల్పశరీర పీడయును, తచ్ఛాంతియును గలుగును. 40 మొదలు 45 వఱకును అన్యత్రచలనమును, సౌధప్రాప్తియును, అఖండయోగమును, బహుద్రవ్యలాభమును, భూలాభమును, ఆత్మబంధునాశంబును, తద్విచారంబును గలుగును 45 మొదలు 50 వఱకును కళత్రశరీర పీడయు, తన్మూలమనోవిచారంబును గలుగును. 50 మొదలు 60 వఱకును దివ్యతీర్థయాత్రాలాభంబును, మానసోత్సాహంబును, యోగ్యపుత్రలాభంబును గలుగును. 60 మొదలు 68 వఱకును బహుభూభాగ్యంబును, జ్ఞానమును, దైవభక్తియును గలిగి ఉత్తమలోకప్రాప్తి గలుగును.

| | | |
|---|---|---|
| | కు | శ గు |
| కే | | రా |
| రబు శు | | |

37 ఈజీవుడు గతజన్మంబున బ్రాహ్మణ కులంబున జన్మించి, దానధర్మములుచేసి,అంత్యవయస్సునందు బ్రాహ్మణ నిందగావించుటచే నీజన్మంబున స్వల్పసంతాన దోషంబును పూర్వపుణ్యవశంబున క్రమంబుగ యోగంబును, సత్క్షేత్రమును సిద్ధించును.

ఈగ్రహమండలికి ఫలము. సదానందమును, మనోధైర్యమును, వాగ్జాలము
ను, బాల్యమందు కష్టమును, భాగ్యమును, అల్పవిద్యావిఘ్నమును, విద్యావృద్ధి
యును, కీర్తియును, రాజద్వారమందు యోగంబును, బహులాభమును, స్వల్ప
సంతాన నష్టంబును, మనోవిచారంబును, అల్పజల గండమును, సోదరవృద్ధియు
ను, మాతృదీర్ఘాయుర్దాయంబును, బాల్యమందు పితృవియోగంబును, మనోవి
చారంబును, క్రమంబుగ యోగప్రాబల్యంబును, సుతనష్టవిచారంబును, మసూ
చికము లేక వ్రణ బాధయును, కపటమును, తొందరయును, క్రౌర్యాధికంబును,
అల్ప దైవభక్తియును, బహు ధనమును, సాహసమును, పూర్ణాయురోగ్యంబును,
బాల్యమందు గ్రహబాధయును, మనోవిచారంబును, సుకళత్రంబును, బహుభా
షణంబును, సోదరులకు సామాన్య రాజయోగంబును గలుగును.

1 మొదలు 6 సంవత్సరముల వఱకును గర్భపీడయు, మసూచికాపీడయు
లేక వ్రణపీడయు, దంతబాధయు, జ్వరపీడయు శాంతియు, అల్పగ్రహబాధయు,
సోదర వృద్ధియును గలుగును. 6 మొదలు 10 వఱకును సోదరశరీర పీడయు,
విద్యారంభమును, పితృయోగ వృద్ధియును, విద్యావృద్ధియును, స్వశరీరాల్పపీడ
యును, దంతపీడయును గలుగును. 10 మొదలు 20 వఱకును విద్యావృద్ధియును,
కళ్యాణప్రాప్తియును, స్వల్పవిద్యావిఘ్నంబును, సత్కళత్రసిద్ధియును గలుగును.
20 మొదలు 30 వఱకును రాజద్వారమందతియోగారంభమును, సమయస్ఫూ
ర్తియును, బహుధనలాభంబును, కళత్రసుఖంబును, గర్భస్రావాదిదోషంబును
లేక సంతాననష్టంబును, సుకీర్తియును, మిత్రబాహుళ్యంబును, పితృచింతయును
గలుగును. 30 మొదలు 35 వఱకును బహుధనలాభంబును, గృహనిర్మాణంబు
ను, ధనవ్యయంబును గలుగును. 35 మొదలు 40 వఱకును కామినీలోలత్వంబు
ను, రాజద్వారమంతియోగంబును, ధనభూలాభంబును, మానసోత్సాహంబును,
అల్పజ్వరబాధయును, శాంతియును గలుగును. 40 మొదలు 50 వఱకును కళత్ర
శరీర పీడయును, శాంతియును, కుటుంబ కలహమును, గృహనిర్మాణం
బును, ధనవ్యయంబును గలుగును. 50 మొదలు 60 వఱకును దైవభక్తియును, భో
గాభి వృద్ధియును, బహుభాగ్యవృద్ధియును, సంతాననష్టంబును, మనోవిచారంబు
ను గలుగును. 60 మొదలు 62 లోగా ఆయుర్విషయము విచారణీయము.




38 ఈజీవుడు గతజన్మంబున కావేరీతీరంబున వైశ్యకులంబున జన్మించి బహుధనసమృద్ధి కలిగి దానధర్మంబుల లోపంబుచే నీజన్మంబున మధ్యమధనంబును, జన్మాంతరదైవభక్తిచే రాజద్వారంబున మధ్యమయోగంబును గలుగును

ఈగ్రహమండలమునకు ఫలము శీఘ్రకోపంబును, వర్తకమూలమధ్యమలాభంబును, క్రమంబుగ ధనార్జనయును, ధనవ్యయంబును, మధ్యమదైవభక్తియును, సోదరవృద్ధియును, మందగుణంబును, సుకళత్రంబును, శరీరమందుష్ణపీడయును, రాజద్వారమందు కీర్తియును, పుత్రీపుత్రవృద్ధియును, అల్పసంతాననష్టంబును, స్వకులదీపకత్వంబును గలుగును.

1 మొదలు 4 సంవత్సరముల వఱకును శరీరమందల్పపీడయును, తచ్ఛాంతియును, తండ్రికి ధనలాభంబును, సంతోషంబును గలుగును. 4 మొదలు 8 వఱకును విద్యారంభమును, సోదరవృద్ధియును, అల్పసోదరనష్టమును, శరీరమందల్పపీడయును గలుగును. 8 మొదలు 16 వఱకును సోదరపీడయును, పితృఋణాధిక్యంబును, స్వల్పకుటుంబవిరోధమును గలుగును. 16 మొదలు 20 వఱకును కళ్యాణప్రాప్తియును, మానసోత్సాహంబును, అల్పవిద్యావిఘ్నంబును, పితృపీడయును, విచారమునుగలుగును. 20 మొదలు 25 వఱకును స్వార్జితబహుధనలాభంబును, వ్యయంబును, సంతానప్రారంభమును, తిరిగివిద్యారంభమును కలుగును 26 మొదలు 30 వఱకును విద్యావృద్ధియును, రాజద్వారమందు యోగప్రాబల్యంబును, పుత్రప్రాప్తియును, గృహమందుకళ్యాణప్రాప్తియును గలుగును. 30 మొదలు 40 వఱకును మాతృమారకమును, గృహనిర్మాణంబును, ధనవ్యయంబును, అల్పసంతాననష్టంబును గలుగును. 40 మొదలు 50 వఱకును తీర్థయాత్రాలాభంబును, రాజద్వారమందు బహుధనలాభంబును, సంతానవృద్ధియును దైవభక్తియును గలుగును. 50 మొదలు 58 వఱకును కళత్రశరీరపీడయును, శాం

లగ్నమును బలయుక్తమగు సౌమ్యగ్రహము చూచుచుండెనేని జాతకుడా గ్రహమునకు జెప్పబడినగుణములుకలవాడగును. జాతకమున సూర్యుడు బలయుక్తుడయ్యేనేని తండ్రిపోలికయును, చంద్రుడు బలయుక్తుడయ్యేనేని తల్లిపోలికయును జాతకునకు గలుగును ॥ ౪౧ ॥

సింహాజగోభిరుదయే జాతో నాళేన వేష్టితో జంతుః ।
లగ్నే కుజేఽథ సౌరే రాశ్యంశసమానగాత్రేషు ॥ ౪౨ ॥

మేష వృషభ సింహములలో నొకరాశి లగ్నమై యాలగ్నమున కుజుడుగాని, శనిగాని యుండగా పుట్టిన శిశువు జననసమయలగ్ననవాంశరాశి "శీర్షాస్య బాహు హృదయం" అను తృతీయాధ్యాయ పంచమశ్లోకమున జెప్పబడిన ప్రకారముగా కాలపురుషుని యేయవయవ మగునో ఆయవయవమునందు నాభినాళ వేష్టితమైయుండును ॥ ౪౨ ॥

భౌమ శని ద్రేక్కాణే పాపే లగ్నే స్థితే శశియుతే వా ।
ద్వ్యేకాదశగై స్సౌమ్యైరభివేష్టితకో భుజఙ్గేన ॥ ౪౩ ॥

క్రూరగ్రహాధిపత్యముగల రాశి లగ్నమై యందు కుజ శని ద్రేక్కాణములయందు జననమయినప్పుడును, చంద్రుడు కుజ శని ద్రేక్కాణములయందున్నప్పుడును లగ్నమునకు ద్వితీయైకాదశములయందు శుభగ్రహములున్నయెడల నాశిశువు సర్పముచేత జుట్టబడినదైయుండును ॥ ౪౩ ॥

సూర్యశ్చతుష్పదస్థశ్శేషాద్విశరీరసంస్థితా బలినః ।
కోశైర్వేష్టితదేహా యమలౌ ఖలు సంప్రజాయేతే ॥ ౪౪ ॥

సూర్యుడు చతుష్పదరాసులయిన మేష వృషభ సింహ ధనురపరార్ధ మకరపూర్వార్ధములలో నొకరాశియందుండగా తక్కిన గ్రహములు బలవంతులయి ద్విస్వభావరాసులయందుండెనేని జరాయువేష్టిత శరీరములుగల కవలు పుట్టుచున్నారు ॥ ౪౪ ॥

లగ్ననవభాగతుల్యామూర్తిర్బలసంయుతాద్గ్రహాద్వాపి ।
నవభాగాద్వర్ణోక్తిశ్శశియోగాత్తత్ర సూతస్య ॥ ౪౫ ॥
బహవో యది బలయుక్తా మిశ్రామూర్తిస్తదా వాచ్యా ।
కులజాతిదేశపురుషాన్ బుద్ధ్వాఽఽదేశం సమాదిశేత్తజ్జ్ఞః ॥ ౪౬ ॥

జన్మకాలమందు లగ్ననవాంశరాశి బలయుక్తమై యుండెనేని తదధిపతి గ్రహసమానశరీరుండగును, నవాంశరాశి బలహీనమై యుండెనేని యన్నిగ్రహము లలో నేగ్రహము బలాధికమైయుండునో తత్సమానశరీరుండగును నగునని “ స్వల్పాకుంచితమూర్ధజః పటుమతిః ” ఇత్యాది చతుర్థాధ్యాయోక్తగ్రహస్వరూప ములను పుట్టినశిశువుకు జెప్పవలయును. జన్మకాలమందు చంద్రుడేనవాంశమం దుండునో ఆనవాంశరాశ్యధిపతియైన గ్రహమునకు సమానమైన శరీరవర్ణము గలవాడగునని “ తామ్రసితారుణ హరితక పీత విచిత్రాసితా ఇనాదీనాం ” అను చతుర్థాధ్యాయ ద్వాదశశ్లోకోక్తగ్రహవర్ణములను శిశువునకు జెప్పవలయును అనేకగ్రహములు బలయుక్తములయి యున్నప్పుడు మిశ్రస్వరూపమును జెప్పవలెను. ప్రాజ్ఞుడగువాడీవర్ణాదికమును దేశ కుల జాతి పురుష భేదముల నెఱింగి చెప్పవలయును ॥ ౪౬ ॥

త్రింశద్భాగే భానుర్గ్రహస్య యస్య స్థితో భవతి ।
తత్తుల్యాప్రకృతిస్స్యాదేవం మునయోఽభ్యవస్యన్తి ॥ ౪౭ ॥

సూర్యుడేగ్రహముయొక్క త్రింశాంశమందుండునో ఆగ్రహమునకు సమానమైన ప్రకృతి గలిగియుండునని మునులనిశ్చయము ॥ ౪౭ ॥

తత్కాలసుహృదరిత్వం బలం చ నీచోచ్చ సంభృతం జ్ఞాత్వా ।
జ్ఞాత్వా గ్రహస్వభావాన్ తేభ్యస్సఙ్చిన్త్య మన్యదపి ॥ ౪౮ ॥

గ్రహముల తాత్కాలిక మిత్రత్వశత్రుత్వంబులను, నీచోచ్చాదికృతబలం బునుం దెలిసి గ్రహములస్వభావంబు నెఱింగి యాగ్రహములవలన నీచెప్పబడిన వానికంటె నితరములగు వానినిగూడనూహింపదగును ॥ ౪౮ ॥

క్షీణేశశినిసపాపే మాతామ్రియతే పితారవౌతద్వత్ ।
బలిభిర్దృష్టేమిశ్రైర్వ్యాధిస్సౌమ్యైశ్శుభంభవతి ॥ ౪౯ ॥

చంద్రుడుక్షీణుడై క్రూరగ్రహయుక్తుడయ్యెనేని తల్లిమృతిజెందును. అట్లే సూర్యుడుపాపగ్రహములతో గూడెనేని తండ్రి మృతిజెందును. బలవంతులగు శుభపాపమిశ్రగ్రహములచే జూడబడెనేని రోగముగలుగును. కేవలశుభగ్రహము లచే జూడబడెనేని శుభమగును ॥ ౪౯ ॥

విపులవిమలమూర్తిస్స్వోచ్చగోవాస్వవర్గే
గురుసితయుతభాంశుర్వోథవేనాథవర్గస్థః ।
అతిశయశుభదాతాపశ్చమేవాపిమాతుః
పితురపిఖలుతద్వద్భాస్కరస్సర్వదైవ ॥ ౫౦ ॥

సంపూర్ణనిర్మల బింబముగల చంద్రుడు గురు శుక్రులతో గూడి స్వోచ్చ మందున్నను, స్వవర్గమందున్నను, పంచమమందున్నను తల్లికి మిగులశుభము నిచ్చును, అట్టిచంద్రుడు బుధునిచేజూడబడుటయు శుభకరము. సూర్యుడు నిర్మలమూర్తియై గురు శుక్ర బుధులతో గూడి స్వోచ్చమందున్నను, స్వవర్గమందున్నను, పంచమమందున్నను తండ్రికి నన్నే మిగుల నెల్లప్పుడు శుభము నిచ్చును ॥ ౫౦ ॥

ఇతికల్యాణ వర్మ విరచితాయాం సారావళ్యాం
సూతికాధ్యాయో నవమః.

---

## అథ దశమోఽధ్యాయః

—:0:—

ఆయుర్జ్ఞానాభావేసర్వంవిఫలం ప్రకీర్తితం యస్మాత్ ।
తస్మాత్తజ్జ్ఞానార్థేరిష్టాధ్యాయం ప్రవక్ష్యామి ॥ ౧ ॥

ఆయుర్దాయ జ్ఞానములేకుండిన జెప్పబడిన జాతక ఫలమంతయు నిష్ఫలమగును గావున నాయుర్జ్ఞానము కొఱకు రిష్టాధ్యాయమును జెప్పుచున్నాను ॥ ౧

ఓజేస్థితాఃపుమాంసశ్శుక్లేఽహనిసూరిభిస్సమాఖ్యాతాః ।
యుగ్మభవనేషు సర్వేకృష్ణేనిశియోషితోబలినః ॥ ౨ ॥

బేసిరాశియందున్న పురుషగ్రహములన్నియు శుక్లపక్షమందును, పగటియందును బలముగలవనియును, సరిరాసులయందున్న స్త్రీగ్రహములన్నియుకృష్ణపక్షమందును, రాత్రియందును బలముగలవనియును విద్వాంసులచే జెప్పబడినది. ॥ ౨ ॥

త్రివిధమిహశాస్త్రకారానియతమనియతంచ యోగజంప్రాహుః ।
యోగసముత్థంతావద్వక్ష్యేపశ్చాత్తుపరిశేషా ॥ 3 ॥

జాతకశాస్త్రకర్తలాయుర్దాయమును నియతమనియును, అనియతమని యును, యోగజమనియును మూడువిధములయిన దానినిగా జెప్పుచున్నారు. అందు యోగజాయుర్దాయమును నిప్పుడు చెప్పుచున్నాను. అనంతరమందు మిగిలి న నియతానియతాయుర్దాయములు రెండును జెప్పబడును ॥ 3 ॥

బృహస్పతిర్లగ్నగృహేఽష్టమస్థసూర్యేందుభౌమా
ర్కజదృష్టమూర్తిః । అబ్దైస్త్రిభిర్భార్గవదృష్టిహీనో లో
కాంతరం ప్రాపయతి ప్రసూతం ॥ ४ ॥

బృహస్పతిలగ్నమున కెనిమిదవయింట మేషమందుగాని, వృశ్చికమందుగా ని యుండి రవి చంద్ర కుజ శనులచే జూడబడుచుండి శుక్రునిచే జూడబడకుండె నేని యాజాతకుని మూడుసంవత్సరములకు లోకాంతరమునుబొందించును ॥ ४॥

వక్రీశనిర్భౌమగృహం ప్రపన్నశ్ఛిద్రేఽథవష్ఠేఽథచతుష్టయేవా ।
కుజేన సంప్రాప్తబలేనదృష్టో వర్షద్వయం జీవయతి ప్రజాతం ॥ ५ ॥

వక్రగతుడగు శని కుజక్షేత్రమగు షష్ఠమందుగాని యష్టమమందుగాని కేంద్రములయందుగాని యుండి బలవంతుడగు కుజునిచే జూడబడుచుండెనేని యాశిశువును రెండేండ్లుజీవింపజేయును ॥ ५ ॥

భాస్కరహిమకరసహితశ్శనైశ్చరో మృత్యుదః ప్రసవకాలే ।
వర్షైర్నవభిర్యాతైరిత్యాహ బ్రహ్మశౌండాఖ్యః ॥ ६ ॥

ప్రసవసమయమందు శనైశ్చరుడు రవి చంద్రులతోగూడి యుండెనేని తొమ్మిది సంవత్సరములు గడుచునప్పుడు మృత్యువు నిచ్చునని బ్రహ్మశౌండుడను దైవజ్ఞుడు చెప్పుచున్నాడు ॥ ६ ॥

భౌమదివాకర సౌరాశ్ఛిద్రేజాతస్యయస్యశత్రుగృహే ।
మ్రియతేఽవశ్యం సనరో యమకృతరక్షోపి మాసేన ॥ ౭ ॥

జన్మలగ్నమునకు షష్ఠమందుగాని యష్టమమందుగాని రవి కుజ శను లుండెనేని యాశిశువు యమధర్మరాజు కాపాడుచుండినను నొకమాసమునకుమృ తి నొందును ॥ ౭ ॥

ఏకః పాపోఽష్టమగశ్శుక్రగృహే పాపవీక్షితో వర్షాత్ ।
మారయతి నరం జాతం సుధారసో యేన పీతోపి ॥ ౮ ॥

అష్టమస్థానము శుక్రక్షేత్రమై యందొక పాపగ్రహముండి పాపగ్రహవీ
క్షితుడయ్యేనేని యాశిశువష్టమస్థానము జేసి ను వానినొ సంవత్సమునకుజం
పును. యీశ్లోకమున "శుక్రగృహే" అనుచోట "శత్రుగృహే" అనిపాఠాంతర
ము. స్పష్టార్థము ॥ ౮ ॥

రవిశశిభవనేశుక్రోద్వాదశరిపురంధ్రగోఽశుభైస్సర్వైః ।
దృష్టఃకరోతిమరణంషడ్భిర్వర్షైర్నసన్దేహః ॥ ౯ ॥

రవి చంద్రక్షేత్రములగు సింహముగాని కర్కాటకముగాని లగ్నమునకు ష
ష్ఠాష్టమద్వాదశములలో నొకటియైయందు శుక్రుడుండి పాపగ్రహములన్నిటిచే
జూడబడుచుండెనేని నిస్సంశయముగా నాశిశువున కారుసంవత్సరములకు మరణ
ము గలుగజేయును ॥ ౯ ॥

కర్కటధామనిసౌమ్యఃషష్ఠాష్టమసంస్థితోవిలగ్నర్క్షాత్ ।
చంద్రేణదృష్టమూర్తిర్వర్షచతుష్కేణమారయతి ॥ ౧౦ ॥

లగ్నమునకు షష్ఠమందుగాని యష్టమమందుగాని కర్కాటకమందు బు
ధుండుండి చంద్రునిచేజూడ బడుచుండెనేని యాశిశువు నాలుగు సంవత్సరములకు
మృతిజెందును ॥ ౧౦ ॥

తీవ్రఫలరాజయోగాయవనాద్యైర్యేవినిర్మితాస్తేషు ।
వక్తవ్యందైవవిదాఖలకులజాతస్యరిష్టమితి ॥ ౧౧ ॥

యవనాదిపూర్వ పండితులచే తీవ్రముగాఫలించు మహారాజయోగము
లే విరచియింపబడినవో ఆయోగములయందు జన్మించిన యనర్హకులజాతునకది
యరిష్టమని దైవజ్ఞుడు చెప్పవలెను ॥ ౧౧ ॥

కేతుర్యస్మిన్నృక్షేఽభ్యుదితస్తస్మిన్ప్రసూయతేయోహి ।
మాసద్వయేనమరణంవినిర్దిశేత్తస్యజాతస్య ॥ ౧౨ ॥

లగ్నమందు కేతువుండగా జన్మించినవాడు రెండుమాసములకు మృతిజెం
దునని జెప్పవలయును ॥ ౧౨ ॥

గగనస్థోదివసకరః పాపైర్బహుభిర్నిరీక్షితస్సద్యః ।
మారయతిభౌమధామనిశనిఖేచనసంశయోభవతి ॥ ౧౩ ॥

సూర్యుడు దశమమందుండి బహుపాపగ్రహములచే జూడబడుచుండెనేని తత్క్షణము చంపుచున్నాడు. ఆదశమము కుజక్షేత్రమయినను, శనిక్షేత్రమయినను నైనయడల నిస్సంశయముగా జంపును ॥ ౧౩ ॥

జన్మాధిపతిః పాపః పాపర్క్షే పాపయుగ్దృష్టః ।
పీడాంజనయతిపుంసాంశుభయుగ్దృష్టోనచాతితరాం ॥ ౧౪ ॥

లగ్నాధిపతి పాపుడై పాపక్షేత్రమందుండి పాపగ్రహదృగ్యోగయుతుడయ్యెనేని జాతకునకు పీడగలుగ జేయును. శుభగ్రహదృగ్యోగయుతుడయ్యెనేని యెక్కువగా పీడింపడు ॥ ౧౪ ॥

లగ్నేద్రేక్కాణానిగడాహివిహంగపాశధరసంజ్ఞాః ।
మరణాయ సప్తవర్షైః క్రూరయుతా న స్వపతి దృష్టాః ॥ ౧౫ ॥

లగ్నమందున్న ద్రేక్కాణములు నిగడ అహి విహంగ పాశధర సంజ్ఞలుగలవి యగునేని యవి క్రూరగ్రహయుక్తములై తదధిపతి గ్రహదృష్టములు కాకుండెనేని యేడేండ్లకు మృతిజెందును ॥ ౧౫ ॥

లగ్నం లగ్నాధిపో యస్య పాపయుక్తేక్షితో భవేత్ ।
పీడాం కరోతి జాతస్య శుభయుగ్దృష్టితోఽల్పికాం ॥ ౧౬ ॥

లగ్నంబును లగ్నాధిపతియును పాపగ్రహములతోగూడి పాపగ్రహములచే జూడబడుచుండెనేని జాతకునకు పీడగలిగించును. శుభగ్రహదృగ్యోగము గూడనుండెనేని యట్టిపీడ తక్కువగానుండును ॥ ౧౬ ॥

రాహుశ్చతుష్టయస్థో నిధనాయ నిరీక్షితో భవతి పాపైః ।
వర్షైర్వదంతి దశభిష్షోడశభిః కేచిదాచార్యాః ॥ ౧౭ ॥

లగ్న చతుర్థ సప్తమ దశమములలో నెందైన పాపగ్రహములచే జూడబడుచు రాహువుండెనేని పదిసంవత్సరములకు జంపునని చెప్పుదురు. మఱికొంద ఱాచార్యులు పదునాఱేండ్లకు జంపునందురు. ॥ ౧౭ ॥

పాపాస్త్రికోణకేంద్రేసౌమ్యాష్షష్ఠాష్టమవ్యయగతాశ్చ ।
సూర్యోదయే ప్రసూతస్సద్యః ప్రాణాం స్త్యజతిజన్తుః ॥ ౧౮ ॥

క్రూరగ్రహములు కేంద్రకోణములయందును, శుభగ్రహములు షష్ఠాష్టమ వ్యయములయందునుండగా సూర్యోదయసమయమున బుట్టిన శిశువుతత్కాలమందు ప్రాణములువిడుచును ॥ ౧౮ ॥

అంశాధిపజన్మపతీలగ్నపతిశ్చాస్తముపగతాయస్య।
సంవత్సరైస్తుమరణంనిర్వ్యాజంకతిపయైరేవ ॥ ౧౯ ॥

జన్మలగ్నాధిపతియును నవాంశాధిపతియును చంద్రరాశ్యధిపతియును నస్తంగతులైనయెడ నాజాతకునకు నిశ్చయముగా గొన్నిసంవత్సరములలోనే మరణము గలుగును ॥ ౧౯ ॥

రాశిప్రమితైర్వర్షైర్మారయతి విలగ్నపో రిపుస్థానే।
మాసైర్ద్రేక్కాణపతిర్దినైస్సైరంశాధిపో హన్తి ॥ ౨౦ ॥

లగ్నాధిపతి శత్రుస్థానమునందుండిన నారాశి ప్రమితములగు సంవత్సరములకును, ద్రేక్కాణాధిపతి శత్రుక్షేత్రముననున్న దద్రాశి సమ్మితమాసంబులకును; నవాంశాధిపతి రిపుస్థానమునందుండిన తద్రాశిపరిమితదినంబులకును జంపును ౨౦॥

మారయతి షోడశాహాచ్ఛనైశ్చరః పాపవీక్షితో లగ్నే।
సంయుక్తో మాసేనతు వర్షాదదృష్టస్తు మారయతి ॥ ౨౧ ॥

శని లగ్నమందు పాపగ్రహవీక్షితుడై యుండెనేని ౧౬ దినములకును; పాపగ్రహయుక్తుడై యుండెనేని యొకమాసమునకును, పాపగ్రహదృగ్యోగము లేకుండెనేని యొకసంవత్సరమునకును జంపును ॥ ౨౧ ॥

క్షీణశరీరశ్చంద్రో లగ్నస్థః క్రూరవీక్షితః కురుతే।
స్వర్గగమనంహి పుంసాం కులీరగోఽజాన్ పరిత్యజ్య ॥ ౨౨ ॥

మేష వృషభ కర్కాటకములు గాక తక్కిన యేలగ్నమందైనను క్రూరగ్రహవీక్షితుడై క్షీణచంద్రుడుండెనేని యాజాతకులను స్వర్గస్థులుగా జేయును ॥

వర్షాన్మారయతి శశీ షష్ఠాష్టమరాశిసంస్థితో లగ్నాత్।
సద్యః క్రూరైర్దృష్టస్సౌమ్యైర్దృష్టాష్టకాచ్చైవ ॥ ౨౩ ॥

లగ్నమునకు షష్ఠాష్టమరాసులలో చంద్రుడున్నయెడల నొకసంవత్సరమునకును, ఆచంద్రుడు క్రూరగ్రహములచే జూడబడుచుండెనేని తత్కాలమందును, శుభగ్రహములచే జూడబడుచుండెనేని యెనిమిదేండ్లకును జంపును ॥ ౨౩ ॥

అశుభశుభైస్సందృష్టే వర్షచతుష్కేణ నిర్దిశేదంతం।
అనుపాతః కర్తవ్యః ప్రోక్తానాం గ్రహైర్దృష్టే ॥ ౨౪ ॥

పూర్వోక్తచంద్రుడు శుభాశుభమిశ్రగ్రహములచే జూడబడుచుండెనేని నాలుగేండ్లకు మరణమని చెప్పవలెను. చెప్పబడినదానికంటె భిన్నముగా హె

చ్ఛాతగ్రహములచే జూడబడుచుండెనేని త్రైరాశికముచేత నాయుఃప్రమాణము ను దెలియవలెను ॥ ౨౪ ॥

పాపాస్తు షష్ఠాష్టమగాః క్రూరైర్వక్రోపసంగతైర్దృష్టాః ।
మాసేన మృత్యుదాస్తే యది నశుభై స్తత్ర సందృష్టాః ॥ ౨౫ ॥

శుభగ్రహములు షష్ఠాష్టమములయందుండి వక్రగతములగు పాపగ్రహములచే జూడబడుచు శుభగ్రహములచే జూడబడకుండెనేని యొకమాసమునకు మరణమును గలుగజేయును ॥ ౨౫ ॥

లగ్నాద్ద్వాదశధనగైః క్రూరైస్త్రియతే చ రంధ్రరిపుసంస్థైః ।
శుభసమ్పర్కమయాతైర్మాసేనష్టష్టమేవాపి ॥ ౨౬ ॥

క్రూరగ్రహములు లగ్నమునకు ద్వితీయద్వాదశములయందుగాని, షష్ఠాష్టమములయందుగాని శుభగ్రహసంపర్కము నొందకయుండెనేని యారవమాసమందుగాని, యెనిమిదవమాసమందుగాని మృతినొందును ॥ ౨౬ ॥

లగ్నాధిపజన్మపతీ షష్ఠాష్టమరిఃఫగౌ ప్రసవకాలే ।
అస్తమితౌ మరణకరౌ రాశిప్రమితైర్వదేద్వర్షైః ॥ ౨౭ ॥

ప్రసవకాలమందు జన్మలగ్నాధిపతియును, చంద్రలగ్నాధిపతియును షష్ఠాష్టమద్వాదశములయందస్తంగతులైయుండిరేని తద్రాశిప్రమితములగు సంవత్సరములకు మృతి గలుగజేయుదురని చెప్పవలెను ॥ ౨౭ ॥

హోరాధిపతిర్ద్యూనే పాపజితో మరణమేవ విదధాతి ।
మాసేన జన్మనాథస్తద్వచ్చంద్రో నయది శుభదృష్టః ॥ ౨౮ ॥

జన్మలగ్నాధిపతిగాని, చంద్రలగ్నాధిపతిగాని గ్రహయుద్ధమున పాపగ్రహముచేత పరాజితుడై సప్తమమందుండి శుభగ్రహదృష్టిలేకుండెనేని యొకమాసమునకు దప్పక మరణమును గలుగజేయును. ఆలాగుననే చంద్రుడును « తద్వచ్చంద్రో » అనుచోట « తద్వచ్ఛిద్రే » అని పాఠాంతరము. ఆప్రకారమష్టమమందున్నను నదే ఫలమని యర్థము ॥ ౨౮ ॥

చంద్రః కుజ రవిజయుతస్స్వసుతస్థానేన చాపి శుభదృష్టః ।
మరణం శిశోః ప్రయచ్ఛతి వర్షే నవమే న సన్దేహః ॥ ౨౯ ॥

చంద్రుడు కుజ శనులతోగూడి శుభగ్రహావీక్షితుడుగాక లగ్నమందమునుం డుండెనేని యాశిశువునకు తొమ్మిదవ సంవత్సరమందు నిస్సందేహముగా మరణము గలుగజేయును ॥ ౨౯ ॥

హోరేశ్వరస్తు మృత్యౌ పాపైస్సకలైశ్చ దృశ్యతే బలిభిః ।
మాసి చతుర్థే మరణం జాతస్య కరోతి మునివాక్యం ॥ ౩౦ ॥

లగ్నాధిపతి యష్టమమందుండి బలవత్పాపగ్రహములన్నిటిచే జూడబడుచుండెనేని యాశిశువునకు నాలుగవమాసమందు మరణము గలుగజేయునని మునివాక్యము ॥ ౩౦ ॥

జన్మాధిపతిస్సూర్యస్స్వపుత్రసహితోఽష్టమే భవతి రాశౌ ।
వర్షైరాశ్రమితైర్మరణాయ సితేన సన్దృష్టః ॥ ౩౧ ॥

చంద్రలగ్నాధిపతి సూర్యుడై శనితోగూడికొని లగ్నమున కెనిమిదవస్థానమందుండి శుక్రునిచే జూడబడుచుండెనేని పదిరెండుసంవత్సరముల కాలము జీవించును ॥ ౩౧ ॥

వ్యయాష్టషష్ఠోదయగే శశాంకే పాపేనయుక్తే శుభదృ
ష్టిహీనే। కేంద్రేషు సౌమ్యగ్రహవర్జితేషు ప్రాణైర్వి
యోగం వ్రజతి ప్రసూతః ॥ ౩౨ ॥

చంద్రుడు శుభగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధములు లేనివాడై పాపగ్రహములయొక్క దృగ్యోగాది సంబంధములు కలవాడై లగ్నషష్ఠాష్టమ ద్వాదశములయందుండియుండగా కేంద్రములయందు శుభగ్రహములెవ్వరును లేకపోయిరేని యాశిశువు బాల్యమునందే మరణమునొందును. ఇందు “ వ్యయాష్టషష్ఠోదయగే ” అనియు “ పాపేనదృష్టే ” అనియు పాఠాంతరములు. స్పష్టార్థములు ॥ ౩౨ ॥

చక్రస్య పూర్వభాగే పాపాస్సౌమ్యాస్తథేతరేచైవ ।
వృశ్చికలగ్నే జాతా గతాయుషో వజ్రముష్టియోగేఽస్మిన్ ॥ ౩౩ ॥

లగ్నమందెన్నిభాగములు గతించినవో అన్నిభాగములను దశమమందు విడిచి శేషించినభాగములు దశమమందును, ఏకాదశ ద్వాదశ లగ్న ద్వితీయ తృతీయములును, చతుర్థమందు లగ్నమందెన్నిభాగములు గతించినవో అన్నిభా

ములవర్యంతంబును చక్రపూర్వార్ధమనఁబడును. చతుర్థమందు మిగిలియున్న భాగంబులును, పంచమ షష్ఠ సప్తమాష్టమ నవమంబులును, దశమమందు లగ్నమందెన్ని భాగములు గతించినవో అన్ని భాగములపర్యంతంబును చక్రోత్తరార్ధమనబడును. చక్రపూర్వార్ధమందు పాపగ్రహములును, చక్రోత్తరార్ధమందు శుభగ్రహములునుండగా వృశ్చికలగ్నమందు బుట్టిన శిశువు లాయుర్విహీనులగుదురు. ఈయోగము వజ్రముష్టి యోగమనఁబడును ॥ 33 ॥

క్షీణే శశిని విలగ్నే పాపైః కేంద్రేషు మృత్యుసంస్థైర్వా ।

భవతి విపత్తిరవశ్యం యవనాధిపతేర్మతం చైతత్ ॥ 34 ॥

క్షీణచంద్రుడు జన్మలగ్నమందుండగా కేంద్రములయందున్నట్టియు నష్టమమందున్నట్టియు పాపగ్రహములచేత జాతకునకవశ్యము మరణము గలుగును. యీమతము యవనేశ్వరునకును సమ్మతము ॥ 34 ॥

రాశ్యంతగతైః పాపైస్సంధ్యాయాం తుహినరశ్మిహోరాయాం ।

మృత్యుః ప్రత్యేకస్థైః కేంద్రేషు శశాంకపాపైశ్చ ॥ 35 ॥

భరద్వాజసంహితయందు "శ్లో॥ ఉదయాత్ప్రాక్తనీసంధ్యా ఘటికాద్వయముచ్యతే। సాయంసంధ్యాద్విఘటికా హ్యాస్తాదుపరిభాస్వతః ॥" అనియున్నది కావున సూర్యోదయమునకుముందు రెండుగడియలు ప్రాతస్సంధ్యయనియు, సూర్యాస్తమయమునకు వెనుక రెండుగడియలు సాయంసంధ్యయనియును దెలియవలెను. అట్టి సంధ్యాకాలమందలి చంద్రహోరా జననకాలమై పాపగ్రహములే రాసులయందైన నంత్యనవాంశములయందుండగా పుట్టినశిశువు జీవింపదు మఱియు కేంద్రస్థానములగు లగ్న చతుర్థ సప్తమ దశమములయందు ప్రత్యేకము గాను మూడు పాపగ్రహములును, చంద్రుడును నొకొక్కస్థానమందొక్కొక్కడయి యుండిరేని యపుడు పుట్టిన శిశువు బ్రతుకడు ॥ 35 ॥

ద్యూనచతురశ్రసంస్థే పాపద్వయమధ్యగే శశిని జాతః ।

విలయం ప్రయాతి నియతం దేవైరపి రక్షితో బాలః ॥ 36 ॥

చంద్రుడు లగ్నమునకు సప్తమ చతుర్థాష్టమములలో నెందైన పాపగ్రహద్వయమధ్యగతుడై యుండగా పుట్టినబాలుడు దేవతలచే రక్షింపబడుచున్నను తప్పక మృతినొందును ॥ 36 ॥

పాపద్వయమధ్యగతే హోరాసప్తాష్టసంస్థితే చంద్రే ।
సౌమ్యైస్సబలైః ఖేటైరనీక్షితే చ ధ్రువం మ్రియతే ॥ ౩౭ ॥

చంద్రుడు లగ్న సప్తమాష్టమములలో నెందైన పాపద్వయమధ్యగతుడై యుండి బలవంతులగు శుభగ్రహములచే జూడబడకుండెనేని యాశిశువు నిశ్చయముగా మృతినొందును ॥ ౩౭ ॥

ద్యూనాష్టమగైః పాపైః క్రూరగ్రహవీక్షితైస్సహ జనన్యా ।
మ్రియతే శుభసందృష్టైస్సత్యస్య మతాద్వదేద్వ్యాధిమ్ ॥ ౩౮ ॥

(లగ్నమందు పాపద్వయమధ్యగతుడై చంద్రుడుండి) సప్తమాష్టమములయందు పాపగ్రహములుండి క్రూరగ్రహములచే జూడబడుచుండెనేని యాశిశువు తల్లితోగూడ మృతినొందును. శుభగ్రహములచే జూడబడుచుండెనేని సత్యాచార్యమతమునుబట్టి తల్లికిని శిశువునకును వ్యాధిమాత్రము గలుగునుగాని మృతి గలుగదు ॥ ౩౮ ॥

గ్రహణోపగతే చంద్రే సక్రూరే లగ్నగే కుజేఽష్టమగే ।
మాత్రా సార్ధం మ్రియతే చంద్రవదర్కే చ శస్త్రేణ ॥ ౩౯ ॥

చంద్రగ్రహణసమయమందు క్రూరగ్రహమగు శనితోగూడి చంద్రుడు లగ్నమందుండగా కుజుడష్టమమందుండెనేని యాశిశువు తల్లితోగూడ మృతినొందును. అట్లే సూర్యగ్రహణకాలమందు క్రూరగ్రహమగు శనితోగాని, బుధునితోగాని కూడి సూర్యుడు లగ్నమందుండగా కుజుడష్టమమందుండెనేని శస్త్రముచే మృతినొందును ॥ ౩౯ ॥

క్షీణేశశినివిలగ్నే కంటకనిధనస్థితైః పాపైః ।
సౌమ్యాదృష్టేమృత్యుస్సద్యోజాతస్య నిర్దేశ్యః ॥ ౪౦ ॥

క్షీణచంద్రుడు శుభగ్రహములచే జూడబడక లగ్నమందుండగా కేంద్రాష్టమములయందు పాపగ్రహములుండిరేని యప్పుడుపుట్టిన శిశువుతత్కాలమందు మృతినొందునని చెప్పవలయును ॥ ౪౦ ॥

ద్యూనగతేఽర్కేలగ్నే యమేకుజేవావిపర్యయేవాపి ।
అన్యతరయుతేచంద్రేశుభైరదృష్టేఽచిరాన్మృత్యుః ॥ ౪౧ ॥

లగ్నసప్తమములలో నెందైన నొకదానియందు సూర్యుడుండి మఱియొక దానియందు శనిగాని కుజుడుగాని యుండగా లగ్నసప్తమములలో నెందైన చంద్రుడు శుభగ్రహములచే జూడబడకయుండెనేని శీఘ్రకాలములో మరణము గలుగును ॥ ౪౧ ॥

హోరాధిపనాస్తగతైః పాపైః క్షీణేవ్యయస్థితేచంద్రే।
జాతస్య భవేన్మరణంస్యాత్ కేంద్రేషుచేన్న శుభాః ॥ ౪౨ ॥

లగ్నాష్టమములయందు పాపగ్రహములుండి క్షీణచంద్రుడు వ్యయస్థుడుండగా కేంద్రములయందు శుభగ్రహములు లేకుండెనేని జాతకునకు శీఘ్రమరణము గలుగును ॥ ౪౨ ॥

లగ్నాంత్యనవమగా నైధనసంయుక్తాశ్చంద్రపారిసూర్యారాః।
జాతస్యవిదధుస్సద్యోగురుణానచేద్దృష్టాః ॥ ౪౩ ॥

లగ్నమందు చంద్రుడును, వ్యయమందు శనియును, నవమమందు సూర్యుడును, అష్టమమందు కుజుడును బృహస్పతిచే జూడబడకయుండిరేని జాతకునకు సద్యోమరణమును గలుగజేయుదురు ॥ ౪౩ ॥

లగ్నేచంద్రేఽర్కేవాపాపాబలినస్త్రికోణనిధనేషు।
సౌమ్యైరమిశ్రదృష్టాస్సద్యోమరణాయకీర్తితాయవనైః ॥ ౪౪ ॥

లగ్నమందు చంద్రుడుగాని రవిగానియుండగా బలయుక్తములగు పాపగ్రహములు పంచమ నవమాష్టమములయందు శుభగ్రహములతోగూడికొనకయు శుభగ్రహములచే జూడబడకయు నుండిరేని యాశిశువునకు సద్యోమరణమును గలుగజేయుదురనియవనులు చెప్పిరి ॥ ౪౪ ॥

శుక్రోరవిశనిసహితోమారయతినరంసదాప్రసవకాలే।
దృష్టోపిదేవగురుణానవభిర్వర్షైర్నసన్దేహః ॥ ౪౫ ॥

ప్రసవకాలమందు శుక్రుడు రవిశనులతోగూడెనేని యాజాతకుని చంపును. బృహస్పతిచే జూడబడుచుండినను తొమ్మిదేండ్లకు నిస్సందేహముగా జంపును

యత్రస్థస్తత్రస్థోరుధిరార్క శనైశ్చరేక్షితశ్చంద్రః।
జననీమృత్యుంకుర్యాన్నతుసౌమ్యనిరీక్షితస్సద్యః ॥ ౪౬ ॥

చంద్రుడేరాశియందైనను రవికుజశనులచే జూడబడుచు శుభగ్రహములచేజూడబడకుండెనేని యప్పుడు తల్లికిమరణము గలుగజేయును ॥ ౪౬ ॥

రుధిరశనైశ్చరదృష్టో దివసకరో దివసజన్మనితుయస్య।
పాపయుతో వాహన్యాత్పితరంనిస్సంశయంజాతః ॥ ४८ ॥

పగటియందు పుట్టిన జాతకునకు సూర్యుడు కుజశనులచే జూడబడుచుండినను పాపగ్రహములతో గూడియుండినను నాజాతకుడు నిస్సంశయముగా తండ్రిని జంపును ॥ ४८ ॥

రహితో బుధగురుశుక్రైర్జన్మనిరుధిరార్కసౌరసహితో ఽర్కః।
కథయతిపితరమతీతంపితురంపిచశరీరకర్తారమ్ ॥ ४७ ॥

జన్మసమయమున సూర్యుడు బుధ గురు శుక్రులతో గూడక కుజశనులతో గూడియుండినేని యాజాతకుని తండ్రియును, తాతయును గతించిరని చెప్పవలయును ॥ ४७ ॥

పాపగ్రహమధ్యగతో దివసకరో దివసజన్మనిరతస్య।
పాపయుతో వాహన్యాత్పితరంనిస్సంశయంజాతః ॥ ४९ ॥

పగటి యందుపుట్టినజాతకునకు సూర్యుడుపాపగ్రహమధ్యగతుడయి నను, పాపగ్రహయుక్తుడయినను నాజాతకుడు నిస్సందేహముగా తండ్రినిజంపును ॥४९॥

సూర్యాదష్టమరాశౌయదియుక్తౌసౌరిలోహితౌప్రసవే।
సౌమ్యాదృష్టౌనిధనంకుర్యాతాంసద్యఏవపితుః ॥ ५० ॥

ప్రసవకాలమందు సూర్యునకెనిమిదవయింట కుజశనులుకూడియుండి శుభగ్రహములచే జూడబడకుండిరేని యాజాతకుని తండ్రికి తత్కాలమందు మృతిగలుగజేయుదురు. " సూర్యాత్సప్తమరాశౌ "అనిపాఠాంతరము. అర్థముసుగమము

పాపగ్రహసంయుక్తశ్చరరాశిగతో దివాకరఃప్రసవే।
పితరంశత్రుజలాన్మృత్యుంకథయత్యల్పాయుషంపితరం ॥ ५१ ॥

ప్రసవసమయమందు సూర్యుడుపాపగ్రహయుక్తుడై చరరాశియందుండెనేని యాజాతకుని తండ్రి యల్పాయుర్దాయముకలవాడనియు విషశత్రుజలాదులవలన మృతినొందుననియును జెప్పవలెను ॥ ५१ ॥

చంద్రాదష్టమరాశౌనవమేవాసప్తమేఽపివాపాపాః।
ఏకత్రతాన్యతమేహన్యుర్జాతంసహజనన్యా ॥ ५२ ॥

పాపగ్రహములన్నియు చంద్రునకు సప్తమాష్టమనవమములలో నెందైననుండిరేని యాశిశువుని తల్లితో గూడజంపుదురు ॥ ५२ ॥

చరరాశిగతేసూర్యే దినజన్మని వీక్షితే కుపుత్రేణ।
కథయతి విదేశయాతం జాతస్య శరీరకర్తారమ్ ॥ ౫౩ ॥

పగటియందు పుట్టిన శిశువునకు సూర్యుడు చరరాశిగతుడై కుజునిచే జూడబడుచుండెనేని యాజాతకుని తండ్రి విదేశగతుడని చెప్పవలెను ॥ ౫౩ ॥

చరరాశిగతం సౌరిం యస్యార్కో రాత్రిజన్మనీక్షేత।
అత్రాపి విదేశస్థం కథయతి పితరం ప్రసూతస్య ॥ ౫౪ ॥

రాత్రియందు జననమాయినపుడు చరరాశియందున్న శనిని సూర్యుడు చూచుచుండెనేని యీ యోగమందును జాతకునితండ్రి విదేశస్థుడని చెప్పవలెను ॥ ౫౪ ॥

రుధిరసహితస్తు సౌరశ్చరభవనే రాత్రిజన్మనిరతస్య।
కథయతి పితరం మృతం పరదేశే నాత్ర సన్దేహః ॥ ౫౫ ॥

రాత్రియందుపుట్టిన శిశువునకు శనికుజునితోగూడి చరరాశియందుండెనేని యాజాతకుని తండ్రి పరదేశమందు గతించెనని నిస్సందేహముగా జెప్పవలెను

యత్రస్థస్తత్రస్థస్య పుత్రే రుధిరార్కిసహితసూర్యః।
ప్రాగ్జన్మనో నివృత్తం కథయతి పితరం ప్రసూతస్య ॥ ౫౬ ॥

సూర్యుడే రాసియందైనను కుజశనులతోగూడి యుండెనేని యాజాతకుడు పుట్టకమునుపు తండ్రి పరలోకగతుడయ్యెనని చెప్పవలెను ॥ ౫౬ ॥

జన్మాష్టసప్తషష్ఠద్వాదశసంస్థేషు పాపేషు।
మాతా సుతేన సార్ధం మ్రియతే నాస్త్యత్ర సన్దేహః ॥ ౫౭ ॥

లగ్న షష్ఠ సప్త మాష్టమ వ్యయములయందు పాపగ్రహము లుండిరేని యాశిశువుతోగూడ తల్లిమృతినొందును. ఇందుసందేహము లేదు ॥ ౫౭ ॥

జీవతి మాతా మ్రియతే సూనుష్షష్ఠాన్త్యగేషు పాపేషు।
జన్మాష్టసప్తమేషు చ జీవతి సూనుర్మ్రియేత తన్మాతా ॥ ౫౮ ॥

జన్మలగ్నమునకు షష్ఠవ్యయములయందు పాపగ్రహము లుండినయెడ తల్లి బ్రతుకును గాని శిశువు మృతిజెందును. లగ్నసప్తమాష్టమములయందు పాపగ్రహములుండిన యెడల నాశిశువు జీవించునుగాని శిశువుమొకట తల్లి మృతి జెందును ॥ ౫౮ ॥

వక్రో వా సౌరో వా ద్వాదశసంస్థో నయనహంతా ।
దక్షిణనయనం సౌరో వామమథాంగారకో హన్యాత్ ॥ ౫౯ ॥

కుజశనులు ద్వాదశమందుండిన వాశిశువుయొక్క కన్నులు పోవును. అందు శనియుండినకుడికన్నును, నంగారకుడుండిన నెడమకన్నును బోవును ॥ ౫౯ ॥

యుగపచ్చంద్రాదిత్యౌ ద్వాదశభే సంస్థితౌ గ్రహౌ స్యాతాం ।
కురుతః ప్రసూతిమంధం పాపష్షష్ఠేఽథవా నిధనే ॥ ౬౦ ॥

లగ్నాద్వ్యయమందుసూర్యచంద్రులు కలిసియున్నపుడును, షష్ఠాష్టమముల యందు పాపగ్రహములున్నపుడును బుట్టినశిశువు గ్రుడ్డియగును ॥ ౬౦ ॥

అథవాప్యన్యతరయుతే ద్వాదశభే జాయమానస్య ।
అత్రాపి హరేన్నయనం దక్షిణమర్కశ్శశీ సవ్యమ్ ॥ ౬౧ ॥

ద్వాదశమందు సూర్యుడుగాని చంద్రుడుగాని యుండినను జాతకునియొక్క కన్నుపోవును. అందుసూర్యుడుండిన గుడికన్నును, చంద్రుడుండిన నెడమ కన్నును బోవును ॥ ౬౧ ॥

స్వర్భానునోపసృష్టా యది హోరా దినకరశ్చ జామిత్రే ।
జాతస్తత్ర మనుష్యో నిస్సందిగ్ధం భవత్యంధః ॥ ౬౨ ॥

లగ్నమందు రాహువుండి సప్తమమందు సూర్యుడుండగా బుట్టినమనుష్యుడు నిస్సంశయముగా గ్రుడ్డివాడగుచున్నాడు ॥ ౬౨ ॥

ధనరాశౌ ద్వాదశభే చంద్రసూర్యశ్చ విస్థితో యత్ర ।
తత్రాపి భవత్యంధో యద్యష్టమషష్ఠయోః పాపా ॥ ౬౩ ॥

ద్వితీయమందును, వ్యయమందును చంద్రుడును సూర్యుడునుండగా షష్ఠమందును నష్టమమందును పాపగ్రహములున్నయెడల జాతకుడంధుడగును ॥ ౬౩

రజనికరష్షష్ఠగతో నిధనే సూర్యో రవేస్సుతో వ్యయభే ।
వక్రః కుటుంబరాశావత్రాప్యంధో భవేజ్జాతః ॥ ౬౪ ॥

చంద్రుడుషష్ఠమందును, సూర్యుడష్టమమందును, శనిద్వాదశమందును కుజుడుద్వితీయమందును నుండగా బుట్టినవాడును నంధుడగును ॥ ౬౪ ॥

రుధిరాఙ్గసౌరయుక్తశ్చంద్రో నిధనేఽథవాఽపి షష్ఠే వా ।
పిత్తశ్లేష్మవికారైర్దృష్టిం హన్యాదశుభదృష్టః ॥ ౬౫ ॥

కుజ శనులతోగూడిన చంద్రుడు పాపగ్రహవీక్షితుడై షష్ఠమందుగాని యష్టమమందుగాని యున్నయెడల పైత్య శ్లేష్మవికారములచే దృష్టినశింప జేయును ॥ ౬౫ ॥

దక్షిణమష్టమసంస్థస్సవ్యంతుహరేత్సమాశ్రితష్షష్ఠం ।
సౌమ్యైర్నిరీక్షితతనుస్సదోషనహరేత్తుపశ్చాద్వా ॥ ౬౬ ॥

అట్టిచంద్రుడష్టమమందుండిన కుడికన్నును, షష్ఠమమందుండిన నెడమకన్నును బోగొట్టును. శుభగ్రహములచే జూడబడుచుండెనేని కాలాంతరమందు బోగొట్టిన బోగొట్టవచ్చును గాని యప్పుడుపోగొట్టడు ॥ ౬౬ ॥

దినకరసుతేనసహితో నిధనేషష్ఠేసమాశ్రితశ్చంద్రః ।
వాతశ్లేష్మవికారైర్దృష్టింహన్యాదశుభదృష్టః ॥ ౬౭ ॥

చంద్రుడుశనితోగూడి పాపగ్రహనిరీక్షితుడై షష్ఠస్థానమునగాని యష్టమస్థానమునగాని యున్నయెడల వాతశ్లేష్మ వికారములచే దృష్టిని బోగొట్టును

నిధనేదక్షిణనయనంషష్ఠేసవ్యం హరేత్తునియమేన ।
సౌమ్యైస్తు దృశ్యమానో నహరేదథవా హరేత్పశ్చాత్ ॥ ౬౮ ॥

అట్టి చంద్రుడష్టమమునందుండి దక్షిణనేత్రమును, షష్ఠమందుండి వామనేత్రమును హరించును. సౌమ్యగ్రహములచే జూడబడుచుండెనేని హరింపడు. అట్లుగాకున్న కాలాంతరమందు హరించును ॥ ౬౮ ॥

ఏతేనైవతువిధినాసౌరారదివాకరాశ్రితశ్చంద్రః ।
కుర్యాద్దృష్టివికారంనానారోగైర్ధ్రువంజన్తోః ॥ ౬౯ ॥

ఈప్రకారముగానే శనికుజరవులతోగూడిన చంద్రుడు జాతకునకు నిశ్చయముగా నానారోగములచే దృష్టివికారమును గలుగజేయును ॥ ౬౯ ॥

ఏకాదశేతృతీయేహోరాయాః పాపసంయుతేశశిని ।
కర్ణవికలోనరస్స్యాత్పాపగ్రహవీక్షితస్సద్యః ॥ ౭౦ ॥

లగ్నైకాదశతృతీయములయందు చంద్రుడు పాపగ్రహయుక్తుడైయుండి పాపగ్రహవీక్షితుడయ్యెనేని యాజాతకుడు తత్కాలమందు కర్ణవైకల్యముగలవాడగును ॥ ౭౦ ॥

నవమేపఞ్చమరాశౌపాపగ్రహవీక్షితౌగ్రహౌస్యాతాం ।
రోగ్రౌతోగ్రపఘాతమతులంకుర్యాతాంజాతమాత్రస్య ॥ ౭౧॥

పంచమమందొక గ్రహంబును నవమమందొక గ్రహంబును పాపగ్రహవీక్షితులై యుండి రేని యాశిశువునకు బుట్టినప్పుడే శ్రోత్రేంద్రియవిఘాతమును గలుగ జేయుదురు ॥ ౭౧ ॥

నవమే దక్షిణకర్ణం వామం నైపంచమే గ్రహో హన్యాత్ ।
అత్రైవ సౌమ్యభేవా శుభదృష్టే వా శుభం వాచ్యం ॥ ౭౨ ॥

అట్టిగ్రహము నవమమందుండి కుడిచెవిని, పంచమమందుండి యెడమచెవిని జెడగొట్టును. ఆపంచమనవమములు శుభక్షేత్రములై శుభగ్రహదృష్టములయ్యేనేని కర్ణోపఘాతముకలుగదని చెప్పవలెను ॥ ౭౨ ॥

రాశౌ హోరాన్తరం ప్రాప్యయోయస్మిన్ వ్యాధిమాప్నుయాత్ ।
తచ్ఛాస్యహోరాపరివేచనర్ద్ధిస్థానఙ్ఛయఙ్ఛవేత్ ॥ 23 ॥

రోగప్రాప్తిలగ్నంబును, జన్మలగ్నంబును చంద్రలగ్నంబును రోగాదులనెఱుంగుటకు ముఖ్యములు ॥ ౭౩ ॥

సవ్యాపసవ్యభాగే యోగమత్రైవగ్రహాస్తుసంప్రాప్తాః ।
కుర్యుర్వ్రణాఙ్ఛచిహ్నంవ్యఙ్గభయంపాపవీక్షితాస్సామ్యాః ॥ ౭౪ ॥

లగ్నమునకు వామదక్షిణ భాగములయందు బహుగ్రహములుకూడి యుండి రేని "మూర్ధాలోచన కర్ణగంధవహానం" ఇత్యాది చతుర్థాధ్యాయ పంచమ శ్లోకోక్తప్రకారము జాతకుని యవయవములయందు శుభగ్రహములుండి రేని చిహ్నంబును, పాపదృష్ట శుభగ్రహములుండి రేని వ్యంగభయంబును, పాపులుండి రేని వ్రణనాశాదికంబును గలుగ జేయుదురు ॥ ౭౪ ॥

విదిత్వాత్రితయం హ్యేతత్ప్రత్నస్యతుపి శేషతః ।
శుభాశుభాతువిజ్ఞేయా గ్రహసంయోగకారణా ॥ ౭౫ ॥

ఈలగ్నాదికమందు శుభ పాప మిశ్రగ్రహస్థితిఫలభేదంబులనెల్లను బాగుగ నెఱింగి గ్రహసంయోగము కారణముగాగల శుభాశుభ ఫలంబుల దెలియవలెను.

చంద్రాదిత్యౌతృతీయస్థౌ మీనక్షేత్రంసయస్యతు ।
వ్యాధింతత్రవిజానీయాత్త్రిరాత్రంతస్యజీవితం ॥ ౭౬ ॥
అత స్తృతీయేనతుక్షేత్రేసమస్తేవ్య స్తగేపివా ।
రవౌరాత్రిం పరాం జీవేచ్చంద్రే దశమమాశ్రితే ॥ 22 ॥

సూర్యచంద్రులు తృతీయస్థానమగు మీనమందుండగా జాతకునకు వ్యాధికలిగెనేని మూడురోజులు జీవించునుగావున నిట్లు రవిచంద్రులు కలిసియున్నయెడల మూడవనక్షత్రమందు మృతినొందును. ఆస్థానమున చంద్రుడుండక సూర్యుడొక్కడేయుండినను చంద్రుడు దశమమందున్నయెడల నొకదినము జీవించును ॥ ౨౭ ॥

సహితౌ చంద్రజామిత్రే యస్యాంగారకభాస్కరౌ ।
జాతస్య తస్య హి తదా భవేత్సప్తాహజీవితమ్ ॥ ౨౮ ॥

జననకాలమందు చంద్రుడున్న రాశికి సప్తమమందు రవికుజులు కలిసియుండిరేని యాశిశువేడురోజులు బ్రతుకును ॥ ౨౮ ॥

చతురశ్రస్థితాః పాపా వామదక్షిణగా యదా ।
తదా యో వ్యాధిమాప్నోతి దశరాత్రం సజీవతి ॥ ౨౯ ॥

చతుర్థాష్టమములయందు వక్రావక్రగతిగల పాపగ్రహములుండగా నెవనికి వ్యాధికలుగునో వాడు పదిరాత్రులు జీవించును ॥ ౨౯ ॥

త్రికోణే దక్షిణే సూర్యశ్చంద్రో వామే యదా భవేత్ ।
యస్తదా లభతే వ్యాధిం ద్వాదశాహం సజీవతి ॥ ౩౦ ॥

పంచమమందు సూర్యుడును, నవమమందు చంద్రుడునుండగా రోగము వచ్చినవాడు పన్నెండురోజులు బ్రతుకును ॥ ౩౦ ॥

త్రికోణస్థో యదా చంద్రశ్చతురశ్రేఽథ భాస్కరః ।
తదా దుర్వ్యాధినా పుత్రస్త్రిరాత్రం నాతివర్తతే ॥ ౩౧ ॥

పంచమ నవమములలో చంద్రుడును, చతుర్థాష్టమములయందు సూర్యుడునుండగా దుష్టవ్యాధియంకురించిన శిశువు మూడురోజులతిక్రమించి జీవింపడు॥

యదా హోరాచతుర్థస్థశ్చంద్రష్షష్ఠస్థితో రవిః ।
అష్టాదశాహం చ నరస్తదా వ్యాధిసమన్వితః ॥ ౩౨ ॥

చంద్రుడు లగ్నచతుర్థస్థానస్థితుడును, సూర్యుడు షష్ఠస్థానస్థితుడునై యుండగా రోగియగువాడు పదునెనిమిదిదినములు జీవించును ॥ ౩౨ ॥

రవిర్యదా చంద్రమసస్త్రికోణస్థానమాశ్రితః ।
వింశతిం దివసాన్ జీవేత్తదా వ్యాధిభయార్దితః ॥ ౩౩ ॥

చంద్రునకు పంచమ నవమములయందు సూర్యుడుండగా రోగప్రాప్తియ య్యేనేని యిరువదిదినములు జీవించును ॥ ౮౩ ॥

హోరాష్టమస్థితస్సూర్య స్స్వరభావనిరీక్షితః ।
యఃపుమాన్ ప్రాప్నుయాద్వ్యాధిం న సజీవేద్వ్యపత్యతే ॥ ౮౪ ॥

లగ్నమునకష్టమమందు సూర్యుడుండి కుజ శనులచే జూడబడుచుండగా రోగియగువాడు మృతినొందునుగాని జీవింపడు ॥ ౮౪ ॥

హోరాయాం కణ్టకే భౌమో భవేద్యస్య ప్రజాయతః ।
నచ కేంద్రగతో జీవో జాయతే మృతఏవ సః ॥ ౮౫ ॥

జన్మకాలమందు కుజుడు లగ్న కేంద్రగతుడైయుండగా బృహస్పతి కేంద్రములయందు లేకుండెనేని యాశిశువు చచ్చిపుట్టును ॥ ౮౫ ॥

అథ హోరాగతస్సూర్యో నచ కేన్ద్రే బృహస్పతిః ।
నిధనే వా పరఃకశ్చిజ్జాతమాత్రో వినశ్యతి ॥ ౮౬ ॥

లగ్నమందు సూర్యుడుండి కేంద్రమందు బృహస్పతిలేక అష్టమమందిక నొకపాపగ్రహముండెనేని యాజాతకుడు పుట్టగానే మృతినొందును ॥ ౮౬ ॥

హోరాయాం కణ్టకే చన్ద్రో నచ కేన్ద్రే బృహస్పతిః ।
నిధనే వా పరః కశ్చి జ్జాతమాత్రో వినశ్యతి ॥ ౮౭ ॥

చంద్రుడు లగ్న కేంద్రగతుడగుచుండ బృహస్పతి కేంద్రగతుడుగాక మఱియొకపాపగ్రహమష్టమమందుండెనేని యాశిశువు పుట్టుచునే చచ్చును ॥ ౮౭ ॥

ద్రేక్కాణజామిత్రగతో యస్య స్యాద్దారుణో గ్రహః ।
హోరాగతశ్శశాంకశ్చ సద్యో హారతి జీవితమ్ ॥ ౮౮ ॥

ద్రేక్కాణలగ్నమునకు సప్తమమందు క్రూరగ్రహముండగా చంద్రుడు లగ్నగతుడయ్యేనేని తత్క్షణము చంపును ॥ ౮౮ ॥

గ్రహాస్సమేయుగ్బహవో నిధనే యస్య జన్మని ।
మాసం వా సప్తరాత్రం వా తస్యాయుస్సముదాహృతం ॥ ౮౯ ॥

జన్మలగ్నమున కష్టమమందు బహుగ్రహములుకూడియుండెనేని యాశిశువుయొక్క జీవితమొకమాసమనికాని, యేడురోజులనికాని చెప్పవలెను॥౮౯॥

శనైశ్చరశ్చ హోరాయాం నిధనే చ మహీసుతః ।
నచ దేవగురుః కేన్ద్రే మృతగర్భః ప్రసూయతే ॥ ౯౦ ॥

లగ్నమందు శనియును, నష్టమునందంగారకుడునుండగా బృహస్పతి కేంద్రమందు లేకుండెనేని యాశిశువు గర్భమందు మృతినొంది ప్రసూతమగును ॥

యః ప్రాగ్విలగ్నే ద్రేక్కాణస్తత్సమానో యదా గ్రహః।
భవేత్త్రికోణగాః పాపాస్తత్సమానఫలో భవేత్ ॥ ౯౧ ॥
సౌరే వ్యాధిమవాప్నోతి మరణం ధరణీసుతే।
సూర్యేస్యాద్వ్యాధివైకల్యం మరణం నాత్ర సంశయః ॥ ౯౨ ॥

ద్రేక్కాణలగ్నమందెయ్యదియైన నొకగ్రహముండి యాగ్రహమునకు పంచమ నవమములయందు పాపగ్రహములున్నయెడల వక్ష్యమాణరీతిగా నాగ్రహమునకు దగినఫలము నిచ్చును. ఎట్లనగా:—శనియుండిన రోగియగును. కుజుడుండిన మృతినొందును. సూర్యుడుండిన రోగమువలన వైకల్యంబును, మరణంబును గలుగును. ఇందు సంశయము లేదు ॥ ౯౨ ॥

అథ హోరాగతో భౌమః కేంద్రస్థశ్చ భృగోస్సుతః।
స నైమరణమాప్నోతి హోరాయాం పునరాగతే ॥ ౯౩ ॥

లగ్నమందు కుజుడుండి కేంద్రమందు శుక్రుడుండెనేని యాజాతకుడాలగ్నము తిరిగివచ్చునపుడు మృతినొందును ॥ ౯౩ ॥

గురుస్త్రికోణే హోరాయాం హోరేశశ్చ మహీసుతః।
తస్యాన్యతరకేంద్రస్థస్సద్యో జీవితనాశనః ॥ ౯౪ ॥

లగ్నమందు లగ్నాధిపతియును, పంచమ నవమములలో నెందైన బృహస్పతియునుండగా నేదైననొక కేంద్రమందు కుజుడుండెనేని సద్యోమరణము గలుగును ॥ ౯౪ ॥

నిధనాస్తవ్యయలగ్నత్రికోణగాః క్షీణచన్ద్రసంయుక్తాః।
పాపాబలినశ్శుభదైరదృశ్యమానా గతాయుషం కుర్యుః ॥ ౯౫ ॥

లగ్న పంచమ నవమ సప్తమాష్టమ ద్వాదశములయందు క్షీణచంద్రునితో గూడిన పాపులు బలవంతులైయుండి శుభగ్రహములచే జూడబడకుండిరేని యాజాతకునాయుశ్శూన్యునిగా జేయుదురు ॥ ౯౫ ॥

యోగే బలినస్థానం స్వం వా లగ్నం గతేపి వా చన్ద్రే।
బలవతి వా శుభదృష్టే హ్యేవర్షాన్మృత్యుకాలస్స్యాత్ ॥ ౯౬ ॥

పూర్వోక్తయోగమందు బలయుక్తమగు గ్రహముయొక్క క్షేత్రమం దుగాని, స్వక్షేత్రమందుగాని, లగ్నమందుగాని చంద్రుడు బలవంతుడైయుండె నేని శుభగ్రహవీక్షితుడైనను నొకసంవత్సరములో నాశిశువు చనిపోవును ॥ ౯౬ ॥

రవి చన్ద్ర భౌమ గురుభిః కుజ గురు సౌరేన్దుభి స్తథైకస్థైః ।
రవి శని భౌమ శశాఙ్కై ర్మరణం ఖలు షణ్ముఖిర్వర్షైః ॥ ౯౭ ॥

రవి చంద్ర కుజ గురులుగాని, కుజ గురు శని చంద్రులుగాని, రవి శని కుజ చంద్రులుగాని యొక్కచోటనుండిరేని యైదుసంవత్సరములకు మృతిగలుగును. ఇందు ‹‹ కుజ గురు సౌరేన్దుభిః ›› అనుచోట ‹‹ కుజ భృగు సూర్యేందుభిః ›› అని పాఠాంతరము. దానికి రవి చంద్ర కుజ శుక్రులని యర్థము ॥ ౯౭ ॥

రవి శశియుక్తశ్శశిజస్సౌమ్యైర్దృష్టో వినాశయతి నూనం ।
ఏకాదశభిర్వర్షై రేవాం కేపి స్థితం జాతం ॥ ౯౮ ॥

బుధుడు రవి చంద్రులతో గూడి శుభగ్రహములచే జూడబడుచుండెనేని యాశిశువును దేవోత్సంగమందున్నను నిశ్చయముగా పదకొండేండ్లకుజంపును ॥

లగ్నే రవి మన్ద కుజైశ్శుక్రగృహే సప్తమే శశీ క్షీణః ।
దృష్టో న దేవగురుణా సప్తభిరబ్దైర్వినాశయతి ॥ ౯౯ ॥

లగ్నమందు రవి కుజ శనులుండగా సప్తమము శుక్రక్షేత్రమై యందు క్షీణచంద్రుడుండి బృహస్పతిచే జూడబడకుండెనేని యాశిశువునేడేండ్లకు జంపును. ‹‹ లగ్నే రవి మంద కుజాశ్శత్రుగృహే ›› అని పాఠాంతరము. ఇచ్చట శత్రుగృహ మనగా షష్ఠరాశియని యర్థము ॥ ౯౯ ॥

క్షీణేన్దౌ రవిముషితతనుః క్షితిసుతమన్దావలోకితో ఽభయుతః ।
వర్షచతుష్కే చన్ద్రో మారయతి కిమత్ర గణితేన ॥ ౧౦౦ ॥

అతిక్షీణచంద్రుడు కుజ శనులచే జూడబడుచుగాని, కుజ శనులతో గూడి కాని కేంద్రమందున్నయెడల నాశిశువును నాలుగేండ్లలో జంపును. కావున నా జాతకుని యాయుర్దాయవిషయమున గణితముతో బనిలేదు. ఇందు ‹‹ వర్షద్వయేన ›› అని పాఠాంతరము ॥ ౧౦౦ ॥

లగ్నాధిపతేశ్చంద్రో మరణపదస్థోఽతికృష్ణతాం యాతః ।
క్రూరైస్సకలైర్దృష్టో నశుభైస్సద్వైస్త్రిభిస్తు మారయతి ॥ ౧౦౧ ॥

అతిక్షీణుడగు చంద్రుడు లగ్నాధిపతికష్టమస్థానమునందుండి క్రూరగ్రహము లన్నిటిచే జూడబడుచు శుభగ్రహములన్నిటిచే జూడబడకుండెనేని మూడేండ్లకు జంపును ॥ ౧౦౧ ॥

లగ్నాధిపతిః పాపశ్శశినోంశే రిఃఫగో యదా చన్ద్రాత్ ।
క్రూరైర్విలోక్యమానో మారయతి శిశుం నవభిరబ్దైః ॥ ౧౦౨ ॥

లగ్నాధిపతిపాపుడై చంద్రునకు ద్వాదశరాశియందు కర్కటకనవాంశమందుండి క్రూరగ్రహములచే జూడబడుచుండెనేని యాశిశువును తొమ్మిదేండ్లకు జంపును ॥ ౧౦౨ ॥

దగ్నవభాగే సౌమ్యాః క్రూరాశ్చాదృశ్యకే ప్రసవకాలే ।
రాహుర్లగ్నోపగతో యమాత్మయం నయతి పఞ్చభిర్వర్షైః ॥ ౧౦౩ ॥

ప్రసవసమయమందు దృశ్యార్థచక్రమందు శుభగ్రహములును, నదృశ్యార్థచక్రమందు క్రూరగ్రహంబులునుండగా రాహువు లగ్నమందుండెనేని యాశిశువు నైదేండ్లకు లోకాంతరము నొందించును ॥ ౧౦౩ ॥

రాహుస్సప్తమభవనే శశిసూర్యనిరీక్షితో న శుభదృష్టః ।
దశభిర్ద్వాభ్యాం సహితైరబ్దైర్జాతం వినాశయతి ॥ ౧౦౪ ॥

రాహువు సప్తమమందుండి రవిచంద్రులచే జూడబడుచు శుభగ్రహవీక్షితుడుగాకుండెనేని యాజాతకుని పన్నెండేండ్లకు నశింపజేయును ॥ ౧౦౪ ॥

ఘటసింహవృశ్చికోదయకృతస్థితిర్జీవితం హరతి రాహుః ।
పాపైర్నిరీక్ష్యమాణస్సప్తమితైర్నిశ్చితం వర్షైః ॥ ౧౦౫ ॥

సింహ వృశ్చిక కుంభములలో నేదైన నొకటి లగ్నమై యందు రాహువుండి పాపగ్రహములచే జూడబడుచుండెనేని నిశ్చయముగా నేడేండ్లకుజంపును.

కేతోరుదయః పూర్వం పశ్చాదుల్కాది పవననిర్ఘాతాః ।
రౌద్రే సార్పముహూర్తే ప్రాణైస్సన్త్యజ్యతే జాతః ॥ ౧౦౬ ॥

రౌద్రముహూర్తమందుగాని, సార్పముహూర్తమందుగాని జననమై జన్మమునకు పూర్వమందు కేతువుదయించుటయు, ననంతరమున నుల్కాపాతమహావాతనిర్ఘాతాది దుర్నిమిత్తంబులు దోచుటయుగలిగెనేని యాశిశువు ప్రాణములచే విడువబడును ॥ ౧౦౬ ॥

౨౭. కరణధ్రువము
౧౪ ౫౨
―――
౧౨-౮
౬౦
―――
౭౨౦
౮
―――
౭౨౮
౬౦
―――
౪౩౬౮౦. భాజ్యము.

౫౪-౨౩. చంద్రగతి.
౪-౩౬. రవిగతి.
―――
౪౯-౪౭. గత్యంతరము.
౬౦
―――
౨౯౪౦
౪౭
―――
౨౯౮౭. భాజకము.

ఈభాజ్యభాజకములుపూర్వమందు మాఘ శు॥ ౧ తిథి సాధించునపుడు న్నవే కావున పునః ప్రదర్శనమనవసరమని తలంచి యనంతరగణితోదాహరణము విడువబడినది. లబ్ధము ౧౪ ౩౭. పష్యఘటికాదికము గావున అహర్గణము ౧౩-౫౫ లో గలుపగా నయిన ౨౮-౩౨ సూర్యోదయాది బవకరణ ఘటికావిఘటికలని తెలియవలెను.

పూర్వోక్త కరణానయనముకంటె నీప్రకారాంతరకరణానయనము సూక్ష్మమని యెఱుంగునది.

(కృష్ణాత్తృతీయా దశమీ చరాత్రౌ సా సప్తమీ భూతదివా చవిష్టిః ।
ఏకాదశీ నక్తమథశ్చతుర్థీశుక్లాష్టమీపూర్ణదివా చవిష్టిః ॥)
స్వకాలజనితా విష్టిర్భద్రా వైభిన్నకాలజా ।
విష్టిర్హరతి కార్యాణిభద్రా సర్వత్రమంగళా ॥

అవతారిక ॥ విష్టిభద్రాకరణ భేదముం దెలియజేయుచున్నాడు ॥

తా॥ కృష్ణపక్షమందు తృతీయాదశమీతిథుల రాత్రియందును, సప్తమీచతుర్దశీ తిథుల పగటియందును సప్తమచరకరణము వచ్చినయెడల నదివిష్టియనబడును. శుక్లపక్షమందు చతుర్థ్యేకాదశీతిథుల రాత్రియందును, అష్టమీపూర్ణిమాతిథులపగటియందును సప్తమచరకరణము వచ్చిన నది విష్టియనబడును. ఈచెప్పబ

డిన ప్రకారము వచ్చినది విష్టికరణమగును. దీనికి భిన్నమగు కాలమున వచ్చినది భద్రాకరణమగును. అనగా:— కృష్ణపక్షమందు తృతీయాదశమీతిథుల పగటియందును, సప్తమీ చతుర్దశీతిథుల రాత్రియందును సప్తమచరకరణము వచ్చినయెడలనది భద్రయనబడును. శుక్లపక్షమందు చతుర్థ్యేకాదశీతిథుల పగటియందును, అష్టమీ పూర్ణిమాతిథుల రాత్రియందును సప్తమచరకరణము వచ్చిననది భద్రయనబడును. విష్టికరణము శుభకార్యములను జెరుచును. భద్రాకరణమెల్లెడ శుభకరమైనది. (కొందఱు విష్టిభద్రాపదములను సప్తమచరకరణ పర్యాయములుగా గ్రహించుచున్నారు. కాని ఫలభేదమును గ్రహించుట లేదు.)

ఆయాతిథుల పూర్వోత్తరార్ధముల యందుండు కరణముల దెలియజేయు పట్టిక.

| శుక్లపక్ష తిథులు | పూర్వార్ధ కరణము | ఉత్తరార్ధ కరణము | కృష్ణపక్ష తిథులు | పూర్వార్ధ కరణము | ఉత్తరార్ధ కరణము |
|---|---|---|---|---|---|
| శు. ౧. | కింస్తుఘ్నము | బవ | బ. ౧. | బాలవ | కౌలవ |
| ,, ౨. | బాలవ | కౌలవ | ,, ౨. | తైతుల | గరజి |
| ,, ౩. | తైతుల | గరజి | ,, ౩. | వనజి | భద్ర |
| ,, ౪. | వనజి | భద్ర | ,, ౪. | బవ | బాలవ |
| ,, ౫ | బవ | బాలవ | ,, ౫. | కౌలవ | తైతుల |
| ,, ౬. | కౌలవ | తైతుల | ,, ౬. | గరజి | వనజి |
| ,, ౭. | గరజి | వనజి | ,, ౭. | భద్ర | బవ |
| ,, ౮. | భద్ర | బవ | ,, ౮. | బాలవ | కౌలవ |
| ,, ౯. | బాలవ | కౌలవ | ,, ౯. | తైతుల | గరజి |
| ,, ౧౦. | తైతుల | గరజి | ,, ౧౦. | వనజి | భద్ర |
| ,, ౧౧ | వనజి | భద్ర | ,, ౧౧ | బవ | బాలవ |
| ,, ౧౨ | బవ | బాలవ | ,, ౧౨ | కౌలవ | తైతుల |
| ,, ౧౩. | కౌలవ | తైతుల | ,, ౧౩ | గరజి | వనజి |
| ,, ౧౪. | గరజి | వనజి | ,, ౧౪. | భద్ర | శకుని |
| శు ౧౫. | భద్ర | బవ | బ ౩౦. | చతుష్పాత్తు | నాగవము |

వసుశ్రవణ మైత్రాణాం దశభ్యః పరతో విషం ।
మృగస్వాతి విశాఖానాం జ్యేష్ఠాయాశ్చ చతుర్దశాత్ ॥
పూర్వాభాద్రపదాయాశ్చ షోడశభ్యః పరం విషం ॥
అష్టాదశఘటీభ్యస్స్యా దుత్తరాశతతారయోః ॥
పుష్యపూర్వోత్తరాషాఢా చిత్రాణాంవింశతేః పరం ।
ఏకవింశతి నాడీభ్యః పరంహస్తార్ద్రయోర్విషం ॥
పూర్వాషాఢోత్తరాభాద్రా భరణీనాంజినాత్పరం ।
పునర్వసుమఘావహ్ని రేవతీనాందశత్రికాత్ ॥
ద్వాత్రింశద్ఘటికాభ్యస్స్యాదాశ్లేషాయాః పరం విషం ।
చత్వారింశద్ఘటీభ్యస్స్యాద్రోహిణ్యాః పరతో విషం ॥
పంచాశతో దస్రభస్య పరతో విషముచ్యతే ।
వింశతేష్షట్చ్ఛరేభ్యశ్చ మూలర్క్షస్య పరంవిషమ్ ॥
సంఖ్యోర్ధ్వతశ్చతస్రస్తు విషనాడ్యః ప్రకీర్తితాః ।

అ॥ అశ్విన్యాది ౨౭ నక్షత్రములకును విషధ్రువంబులను, విషప్రమాణంబును జెప్పుచున్నాడు.

టీక ॥ వసుశ్రవణమైత్రాణాం= ధనిష్ఠాశ్రవణానూరాధలకు, దశభ్యః= నక్షత్రారంభము మొదలు పదిగడియలకంటె, పరతః= అనంతరము నుండి, విషం= విషఘటికారంభమగును. మృగస్వాతివిశాఖానాం= మృగశిరస్వాతి విశాఖలకును, జ్యేష్ఠాయాశ్చ= జ్యేష్ఠకును, చతుర్దశాత్= పదునాలుగుగడియలకంటె పరమందు విషఘటికారంభము. పూర్వాభాద్రపదాయాశ్చ= పూర్వాభాద్రకు, షోడశభ్యః పరం= పదునారుగడియలకు పిమ్మట విషం= విషము. ఉత్తరాశతతారయోః = ఉత్తరఫల్గునీశతతారలకు, అష్టాదశఘటీభ్యః= పదునెనిమిదిగడియలతరువాత విషఘటికారంభము, స్యాత్ = అగును. పుష్యపూర్వోత్తరాషాఢాచిత్రాణాం= పుష్యపూర్వఫల్గున్యుత్తరాషాఢాచిత్రలకు, వింశతేః పరం= ఇరువదిగడియల వెనుక విషము. హస్తార్ద్రయోః= ఆర్ద్రాహస్తలకు, ఏకవింశతినాడీభ్యఃపరం= ఇరువదియొ

౫౬ గడియలపయిని, విషం= వర్జ్యము. పూర్వాషాఢోత్తరాభాద్రాభరణీనాం = భరణీ పూర్వాషాఢోత్తరాభాద్రలకు, జినాత్పరం= ఇరువదినాల్గు గడియలపిమ్మట త్యాజ్య ఘటికారంభము. పునర్వసుమఘాంహిప్నా రేవతీనాం= కృత్తికాపునర్వసుమఘా రేవతులకు, దశత్రికాత్ = ముప్పదికంటె పరమందువర్జ్యము. ఆశ్లేషాయాః = ఆశ్లేషకు, ద్వాత్రింశద్ఘటికాభ్యః= ముప్పది రెండుగడియలకంటె, పరం= పరమం దు, విషం= విషము, స్యాత్ = అగును. రోహిణ్యాః= రోహిణికి, చత్వారింశద్ఘటీ భ్యః= నలువదిగడియలకంటె,పరతః= పరమందు,విషం= విషము,స్యాత్ = అగును దస్రభస్య = అశ్వినీనక్షత్రమునకు, పంచాశతః = ఏబదికంటె, పరతః = పరమం దు, విషం = విషము, ఉచ్యతే = చెప్పబడుచున్నది. మూలర్క్షస్య = మూలనక్ష త్రమునకు, వింశతేః = ఇరువదికంటెను, షట్పంచాశద్భ్యశ్చ = ఏబదియారుకంటె ను, పరం= అనంతరమందు, విషం= విషఘటికారంభమగును. సంఖ్యోర్ధ్వతః = ఆయానక్షత్రములకు జెప్పబడిన విషధ్రువసంఖ్యకుమీద, విషనాడ్యస్తు = విషఘటి కలు, చతస్రః = నాలుగుకా, ప్రకీర్తితాః = చెప్పబడినవి.

తా॥ అనూరాధ, శ్రవణము, ధనిష్ఠ యీ 3 నక్షత్రములకు ౧౦ గడియ లమీదను; మృగశిర, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ యీ ౪ నక్షత్రములకు ౧౪ గడియ లమీదను; పూర్వాభాద్రకు ౧౬ గడియలమీదను; ఉత్తరఫల్గుని, శతభిషము యీ ౨ నక్షత్రములకును ౧౮ గడియలమీదను; పుష్యమి, పూర్వఫల్గుని, చిత్త, ఉత్త రాషాఢ యీ ౪ నక్షత్రములకును ౨౦ గడియలమీదను; ఆర్ద్ర, హస్త యీ ౨ నక్షత్రములకును ౨౧ గడియలమీదను; భరణి, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర యీ 3 నక్షత్రములకును ౨౪ గడియలమీదను; కృత్తిక, పునర్వసు, మఘ, రేవతి యీ ౪ నక్షత్రములకును 3౦ గడియలమీదను; ఆశ్లేషకు 3౨ గడియలమీదను; రోహి ణికి ౪౦ గడియలమీదను; అశ్వినికి ౫౦ గడియలమీదను; మూలకు ౨౦, ౫౬ గ డియలమీద రెండుపర్యాయములును విషఘటికలు వచ్చును. సాధారణముగా నారంభము మొదలు ౪ గడియలు విషఘటికాప్రమాణమని తెలియవలెను.

నక్షత్రముల విషధ్రువములు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వినికి | = ౫౦ | మఖకు | = ౩౦ | మూలకు | = ౨౦, ౫౬ |
| భరణికి | = ౨౪ | పుబ్బకు | = ౨౦ | పూర్వాషాఢకు | = ౨౪ |
| కృత్తికకు | = ౩౦ | ఉత్తరకు | = ౧౮ | ఉత్తరాషాఢకు | = ౨౦ |
| రోహిణికి | = ౪౦ | హస్తకు | = ౨౧ | శ్రవణమునకు | = ౧౦ |
| మృగశిరస్సుకు | = ౧౪ | చిత్తకు | = ౨౦ | ధనిష్ఠకు | = ౧౦ |
| ఆర్ద్రకు | = ౨౧ | స్వాతికి | = ౧౪ | శతభిషమునకు | = ౧౮ |
| పునర్వసుకు | = ౩౦ | విశాఖకు | = ౧౪ | పూర్వాభాద్రకు | = ౧౬ |
| పుష్యమికి | = ౨౦ | అనూరాధకు | = ౧౦ | ఉత్తరాభాద్రకు | = ౨౪ |
| ఆశ్లేషకు | = ౩౨ | జ్యేష్ఠకు | = ౧౪ | రేవతికి | = ౩౦ |

ఋక్షాద్యంతఘటీమానం విషమానేన తాడితం ।
షష్ట్యా విభక్తం పూర్వర్క్షే యోజయేద్విషనాడికాః ॥
షష్ట్యాధికే తదూనం తు వర్తమానదినే విషం ।
షష్ట్యాల్పంచేత్పూర్వదినే విషనాడ్యః ప్రకీర్తితాః ॥

అ॥ విషఘటికానయనమును జెప్పుచున్నారు.

టీ॥ ఋక్షాద్యంతఘటీమానం = నక్షత్రాద్యంతప్రమాణ ఘటికాదికమును, విషమానేన = ఆనక్షత్రవిషధ్రువముచేత, తాడితం = గుణించి దానిని, షష్ట్యా = అరువదిచేత, విభక్తం = భాగింపగావచ్చినలబ్ధమును, పూర్వర్క్షే = పూర్వనక్షత్రసూర్యోదయాది ఘటికాదికమందు, యోజయేత్ = కలుపవలెను. అట్లుచేయగా, విషనాడికాః = విషఘటికారంభమగును. (ఆపూర్వనక్షత్రసంకలితసంఖ్య) షష్ట్యాధికే = అరువదికంటె హెచ్చుగానున్నయెడల, తదూనంతు = ఆయరువదితీసివేయగామిగిలినది, వర్తమానదినే = ఆరోజున, విషం = సూర్యోదయాది విషారంభఘటికాదికమగును. షష్ట్యల్పంచేత్ = అరువదికంటెతక్కువైనయెడల, పూర్వదినే = పూర్వదినమందు, విషనాడ్యః = విషఘటికలు, ప్రకీర్తితాః = చెప్పబడినవి.

తా॥ పంచాంగములందు విషఘటికలను దెలియగోరువారికి నానక్షత్రాద్యంతప్రమాణమును ముందుగనుగొనవలెను. ఎట్లనిన—ఆనక్షత్రము పూర్వదినమున గొంతయు పరదినమునఁ గొంతయు నున్నయెడల సామాన్యముగా నహోరాత్రప్రమాణము ౬౦ గడియలు కాఁబట్టి ౬౦ లో పూర్వనక్షత్రముయొక్క పూర్వదినసూర్యోదయాది ప్రమాణమును దీసివేయగా మిగిలినది పూర్వదినమునకుంచిన వర్తమాననక్షత్రప్రమాణమగును. దానిని వర్తమానదినసూర్యోదయాది వర్తమాననక్షత్ర ప్రమాణముతో గలుపగా వర్తమాననక్షత్రాద్యంతప్రమాణమగును. దానిని ఆనక్షత్రవిషధ్రువముచే గుణించి ౬౦ చే భాగింపగా వచ్చిన లబ్ధఘటికాదికము ఆనక్షత్రారంభము మొదలుకొనియున్న విషారంభఘటికాదికము నగుచున్నది. ఆసంఖ్యను పూర్వదినసూర్యోదయాది పూర్వనక్షత్రప్రమాణములో గలుపవలెను అట్లుచేయగా నాసంఖ్య ౬౦ కంటె హెచ్చుగానున్నయెడల ఆసంఖ్యలో ౬౦ తీసివేయగా మిగిలినది వర్తమానదిన సూర్యోదయాది విషఘటికారంభమని తెలియవలెను. ౬౦ కంటె తక్కువగానున్నయెడల నాసంఖ్య పూర్వదినసూర్యోదయాది విషఘటికారంభమని తెలియవలెను. పూర్వదినమందుగాని పరదినమందుగాని సూర్యోదయాది విషారంభఘటికాదికము ఆదినప్రమాణము కంటె తక్కువగానున్నయెడల నారోజు పగలు అన్నిగడియలమీద విషారంభమనియు, దినప్రమాణముకంటె హెచ్చుగానున్నయెడల నందు దినప్రమాణముదీసి వేసి యంతరాత్రమీద విషారంభమనియు దెలియవలెను.

## ఉదాహరణము.

విరోధికృన్నామ సం॥ ర మాఘ శు ౬ గురువాసరమునకు.

అహర్గణము = ౧౭౨౯౧౯

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకృతి | = | ౫ | అమితము | = | ౧౯ |
| చతుష్కము | = | ౧౭ | ప్రమితము | = | ౦ |
| వర్షము | = | ౩ | వృత్తము | = | ౨ |
| రవిపదకము | = | ౨౯౧ | చంద్రపదకము | = | ౨౩౨ |

రవిస్ఫుటధ్రువము = ౨౬, ౮౧, ౧౯. చంద్రస్ఫుటధ్రువము = ౧౩, ౩౩, ౫౮.

౨౯౧--౪, వ = ౨౧, ౨౫, ౪. గ = ౪, ౩౫. అ = ౧౩ ౫౮. చాం (ధ) =
౯. వ (బు) = ౧౪౬.

౨౩౨ చం, ప = ౧౨, ౩౨, ౪౮. గ = ౫౮, ౪౭. వృ (బు) = ౮.

స్ఫుటచంద్రుడు = ౨౬, ౬, ౫౧.

మాఘ శు ౬ గురువారమునాడు ఉత్తరాభాద్ర—౭, ౦,

ఉత్తరాభాద్రానక్షత్రవిషఘటికారంభమును సాధించుచున్నాము.

౬౦-- ౦ అహోరాత్రప్రమాణము.
౫ -- ౫ బుధవారమున పూర్వాభాద్ర.
౫౪· ౫౫ ,, ఉత్తరాభాద్ర.
౭-- ౦ గురువారమున ,,
౬౧--౫౫ భుక్తాస్యంతప్రమాణము.
౨౪ విషధ్రువము.

౬౦)౧౪౮౬--౦(౨౪ ఘ.
౧౨౦
౨౮౬
౨౪౦
౪౬

౫-- ౫ పూర్వనక్షత్రము.
౨౪--౪౬ విషారంభము.
౨౯--౫౧ పూర్వదినసూర్యోదయాది.
౨౭--౫౪ అహఃప్రమాణము.
౧--౫౭ పూర్వదినరాత్రి.

ఇప్పుడు ఉత్తరాభాద్రయొక్క భుక్తాస్యంతప్రమాణమును తెలియవలెను. అహోరాత్రప్రమాణమగు ౬౦ లో పూర్వదినమగు మాఘ శు ౫ బుధవారమునాటి పూర్వాభాద్ర ౫--౫ తీసివేయగా మిగిలిన ౫౪--౫౫ పూర్వదినమందు గతించిన ఉత్తరాభాద్ర. అందు పరదిన సూర్యోదయాద్యుత్తరాభాద్ర ౭--౦ కలుపగానయిన ౬౧--౫౫ ఉత్తరాభాద్రభుక్తాస్యంత ప్రమాణము. దానిని ఉత్తరాభాద్రా విషధ్రువమగు ౨౪ చే గుణించి ౬౦ చే భాగించగా వచ్చిన లబ్ధమగు ౨౪--౪౬ ఉత్తరాభాద్రారంభము మొదలు విషఘటికారంభముగాపున పూర్వనక్షత్రమగు ౫--౫ లో గలుపగానయిన ౨౯--౫౧ అహోరాత్రప్రమాణమగు ౬౦ కంటె తక్కువగానున్నది కావున నీవిషము పూర్వదినమునయినదని తెలియవలెను. అందు పూర్వదినాహఃప్రమాణమగు ౨౭--౫౪ తీసివేయగా ౧-- ౫౭ మిగిలినది. కావున పూర్వదినమగు మాఘ శు ౫ బుధవారమునాటిరాత్రి ఘటికాది ౧--౫౭ అనంతరమందు విషఘటికారంభమని తెలియవలెను.

విషారంభమును సాధించుటకొఱకు ఋక్షాద్యంతమానపు విషఘటికలను గుణకంబును, ౬౦ భాజకంబును గాఁ జేసి గణితలాఘవార్థము గుణక భాజకములు దృఢాంకములుగా జేసి యీక్రింద వ్రాయబడుచున్నవి.

| న | గు | భా | న | గు | భా | న | గు | భా |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | ౫ | ౬ | పుబ్బ | ౧ | ౩ | పూ, షా | ౨ | ౫ |
| భరణి | ౨ | ౫ | ఉత్తర | ౩ | ౧౧ | ఉ, షా | ౧ | ౩ |
| కృత్తిక | ౧ | ౨ | హస్త | ౭ | ౨౦ | శ్రవణ | ౧ | ౬ |
| రోహిణి | ౨ | ౩ | చిత్త | ౧ | ౩ | ధనిష్ఠ | ౧ | ౬ |
| మృగశిర | ౭ | ౩౦ | స్వాతి | ౭ | ౩౦ | శతభిషం | ౩ | ౧౦ |
| ఆర్ద్ర | ౭ | ౨౦ | విశాఖ | ౭ | ౩౦ | పూ, భా | ౪ | ౧౫ |
| పునర్వసు | ౧ | ౨ | అనూరాధ | ౧ | ౬ | ఉ, భా | ౨ | ౫ |
| పుష్యమి | ౧ | ౩ | జ్యేష్ఠ | ౭ | ౩౦ | రేవతి | ౧ | ౨ |
| ఆశ్లేష | ౯ | ౧౫ | మూల | ౧ | ౩౦ | | | |
| మఖ | ౧ | ౨ | ,, | ౧౪ | ౧౫ | | | |

ఋక్షాద్యంతము నానక్షత్రమునకు జెప్పబడిన గుణకముచే గుణించి భాజకముచే భాగింపగా విషారంభఘటికాదికము వచ్చును. దీనికి నిది సమానము.

విషధ్రువస్తు షష్టిఘ్న శ్చంద్రగత్యా విభాజితః ।
పూర్వనక్షత్రసంయుక్తో విషనాడీ ప్రశస్యతే ॥

అవ॥ ప్రకారాంతరముచే విషారంభానయనమును జెప్పుచున్నాడు.

టీక॥ విషధ్రువస్తు = విషధ్రువము, షష్టిఘ్నః = అరువదిచేగుణింపబడి, చంద్రగత్యా = చంద్రగతిచేత, విభాజితః = భాగింపబడి, పూర్వనక్షత్రసంయుక్తః = పూర్వనక్షత్రముతోఁగూడినదై, విషనాడీ = విషఘటికారంభముగా, ప్రశస్యతే = పేర్కొనబడుచున్నది.

తా॥ ఏనక్షత్రవిషారంభము నెఱుంగగోరిన నానక్షత్రవిషధ్రువమును నక్షత్రసామాన్యధ్రువసంఖ్యయగు ౬౦ చే గుణించి యప్పటి చంద్రదినగతిఘటికలచే భాగింపగావచ్చినలబ్ధమును పూర్వనక్షత్రముతో గలుపగా సూర్యోదయాది విషారంభఘటికాదికమగును. ఇది పూర్వప్రకారముకంటె సూక్ష్మమని తెలియవలెను.

# జ్యోతిషప్రకాశిక

—:0:—

ఇది యొక తెలుగు జ్యోతిష మాసపత్రిక ఇందచ్చుపడని జాతకముహూర్త సిద్ధాంత గ్రంథము లచ్చువేయబడుచుండును. ఇంకను ననేక జ్యోతిష విశేషములు వ్రాయబడుచుండును. ఈపత్రికకు సంవత్సరమునకిచ్చు చందాపయికి మా పత్రికమూలముగా రాబడు గ్రంథము లవననే కిట్టును. కనుక చందాదారుగ చేరువారికి లాభమే కాని నితరము లేదు

ఈపత్రికకు సంవత్సరమునకు చందా రు 3-4-0 మాత్రమే. వలయువారీ క్రింది చిరునామాకు వ్రాయవలెను.

| | | |
|---|---|---|
| మేనేజింగు ప్రోప్రయిటరు, జ్యోతిషప్రకాశిక,<br>అమలాపురము, గోదావరిజిల్లా. | } | Managing Proprietor,<br>Jyautishaprakasika,<br>AMALAPURAM,<br>*Godavari District.* |

---

# ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు చరిత్రబోధకములు, మనోహరకథాకల్పితములు నగు నవలలు కాలికో బైండు చేయింపబడి రెండుమాసముల కొకొక్కటిగ వెలువడుచుండును. ఆంధ్రభాషాభివృద్ధికీ నవలలు ప్రథమసోపానము లని చెప్పవచ్చును. ఇందు శాశ్వత చందాదారులుగా చేరువారికి గ్రంథములు డెమ్మీసైజున 100 పేజీలకు పోస్టేజీసహా రు 0-6-0 చొ॥ పంపబడుచుండును సామాన్యముగా నవల 1 కి రు 1-0-0 వెలకు మించియుండదు. ఇతరులకీగ్రంథములు పోస్టేజి గాక 100 పేజీలకు రు 0-8-0 చొ॥ నీయబడును. శాశ్వత చందాదారులు అడ్మిషన్ ఫీజు క్రింద రు 0-2-0 లు మాత్రము చెల్లింపవలయును.

**N B :—** ఈగ్రంథమాలిక కైదుగురు చందాదారులను చేర్చిన వారికిందు వెలువడిన గ్రంథములలో వారుకోరిన నవల బహుమానముగా నీయబడును.

## ఇంకు వెలువడిన నవలలు

| | చందాదారులు | ఇతరులు | | చందాదారులు | ఇతరులు |
|---|---|---|---|---|---|
| దుర్గేశనందిని | 0–12–0 | 1–0–0 | సీతారామ | 1–0–0 | 1–8–0 |
| వసుమతీవసంతము | 1– 0–0 | 1–8–0 | నూర్జహాను | 1–0–0 | 1–8–0 |
| లలితచంద్రహాసము | 0–10–0 | 0-14-0 | రాధారాణి | 0–4–0 | 0–4–0 |
| మృణ్మయి | 1– 0–0 | 1–8–0 | యుగళాంగుళీయకము | 0–3–0 | 0–3–0 |

వలయువారు :—

సెక్రిటరీ, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, నిడదవోలు కృష్ణాజిల్లా, అని వ్రాయవలెను.

సంచితనామము! ఓం. [illegible]!

# అభినవజ్యోతిషగ్రంథము

జాతకఫలమణిమంజరి అను నామమున జ్యోతిష శాస్త్రమునందలి జాతకభాగమును గురించి యొక పుస్తకమును రచించి దానిని మూడు గుచ్ఛములుగ నేర్పఱచి యందు ప్రథమ ద్వితీయ గుచ్ఛములను ముద్రింపించి ప్రకటించియుంటిని. తృతీయమును సిద్ధమైయున్నది.

ప్రథమగుచ్ఛము :— ఇది జ్యోతిష శాస్త్రాభ్యాసి కమాత్రశక్త్యాతో పయోగకంబుగనుండునట్లుల నూతనపద్ధతిని పండితపామరంబుగ దెలియునట్లుల ప్రశ్నోత్తర రూపంబున రచియింపబడెను. ఇందు ప్రామ్ముట్టువిధంబును, రాశిచక్ర నవాంశ చక్రంబుల నేర్పఱచు విధంబును, షోడశవర్గులు కట్టువిధంబును, దశవిధలగ్నంబులు గట్టుటయును, దశాశేషము చేయువిధంబును, నింకను బెక్కు విశేషంబులును, నాయుర్దాయభాగంబును పూర్తిగ వ్రాయబడినవి. గురువు సహాయమక్కఱలేకుండగనే జ్యోతిషమభ్యసింపవచ్చును. ఇటువంటి పుస్తకము మఱియొకటి లేదు.

ద్వితీయగుచ్ఛము :— మిక్కిలి చక్కని ముద్దుపలుకులతో తేట తెలుగున నిదివఱకున్నవారును కనివినియుండని యమూల్యమైన యనేక జ్యోతిష రహస్యంబులు నిందుబొందుపఱచి యోగవిషయములును, తన్వాదిద్వాదశభావఫలములును స్పష్టముగ దెలియునట్లుల ప్రశ్నోత్తర రూపంబుగ రచియింపబడెను. దీనిసహాయమువలన తమ జాతకఫలములను తాము స్వయముగ జూచుకొనవచ్చును. ఈ గ్రంథంబుల రచియించుటయందు «జ్యోతిషఫలరత్నమాల, జాతకరాజీయము, ఉమామహేశ్వర సంవాదము, వాచస్పతీయము, గార్గసంహిత, శ్రీపతీయము, జంబునాథీయము, ఆయుర్వారిచింతామణి, శుక్రనాడి, గురునాడి, ఆయుర్దాయప్రబోధిని, దైవజ్ఞవిలాసము" మొదలగు గ్రంథంబులం బరిశీలించితిమి. ఇట్టి గ్రంథమిదివఱలో నెవరిచేత రచియింపబడియుండలేదు.

నిత్యము పెక్కుప్రతులు విక్రయమగుచున్నవి. అనేక యోగ్యతాపత్రికలను బొందబడెను.

| | | | రు—అ—ప |
|---|---|---|---|
| జాతకఫలమణిమంజరి తెలుగు | ప్రథమగుచ్ఛము | కాకితపుబయిండు | 0—12—0 |
| ,, | ,, | మార్బిలుబయిండు | 0—14—0 |
| ,, | ,, | కాలికోబయిండు | 1—2—0 |
| ,, | ద్వితీయగుచ్ఛము | పేపరుబయిండు | 1—4—0 |
| ,, | ,, | కాలికోబయిండు | 1—8—0 |
| ,, | ఇంగ్లీషు ప్రథమగుచ్ఛము | పేపరుబయిండు | 0—14—0 |
| ,, | ,, | కాలికోబయిండు | 1—2—0 |

తపాలాఖర్చులు వగైరాలు కొనువారే భరింపవలెను.

వలయువారు ఇవటూరి అప్పన్న

అమలాపురము, గోదావరిజిల్లా

అని వ్రాయవలెను.